# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

శ్రీలు మోస్తరుగానే మీకు కూడా ప్రతీ రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతీ ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు, బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి.

బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఉచితమైన మార్గం—ప్రతీ రోజు

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL-1

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]
శుక్రవారం : 17-2-'78
పింగళనామ సం. మాఘ శు. దశమి
*సంపుటము 71 : సంచిక 22*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టుతో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

27—1—78 వ తేది ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం మురళీ మోహన్, జయసుధ మమ్మల్నెంతో ఆకర్షించింది. రాగ మాలిక సీరియల్ చాలా, బాగా నడుస్తుంది. ప్రచురించిన మీకు, రచయిత్రి శ్రీమతి మాధవ పెద్ది పుణ్యశీలా ప్రసాద్‌గార్కి మా ధన్యవాదాలు అంతేకాక శ్రీనివాస్‌గారి సినిమా విశేషాలుమాకెంతో తృప్తినిస్తుంది. మీ (మా) పత్రికకోసం ఎప్పుడూ ఎదురు చూసే మీ పాఠకులు.

యస్. వి. త్రినాథ్, జి. సత్యనారాయణ (సోమ దేవరపాలెం.)

## తాజా కాలమ్

జయలక్ష్మి ముఖ చిత్రంతో వెలు వడిన 3—2—78 వ తేదీ పత్రికలో తాజా కాలమ్ చాలా బాగుంది. పేస్ట్ జోకర్ కథ, ఇటీ వల వచ్చిన కథలన్నింటికన్నా, చాలా బాగుంది. రచయిత కథ నడిపిన తీరు చాలా ప్రశంస నీయము. యాధార్థ్యికం కథ కూడా బాగానే ఉన్నా, కొంచెం అసహజంగా గోచరిస్తోంది.

పెన్మెత్స సూరిబాబు— [విజయవాడ]

## శీర్షికలు

మాకీ మధ్య సామాన్యుడు నల్లపూసై పోయాడు. జనతా పార్టీ వచ్చాక సామాన్యుడు కనగడంలేదా...?వీరాజీగారు బొత్తిగా బైస్కోపుల మీద దృష్టి మళ్లించినట్లున్నారు. సినిమా ప్రపంచం ఓ చెవిటి ప్రపంచం. ఎందుకసలే శంఖం పూదుతారు. వినబడదు కదా వారి కెటూ.

టీ వీ యమ్మూర్తి—[బాపట్ల.]

## కార్టూన్లు

27—1—78 సంచికలో కార్టూన్లు ఎక్కు వగా వేసినందుకు చాలా ఆనందముగా వున్నది. రాగమాలిక సీరియల్ వారవారం కొత్త మలు పులు తిరుగుతూ మమ్మల్ని ఆహ్లాదపరుస్తున్న కొత్త సీరియల్ ప్రారంభించక పోయినప్పటికి 4కథలువేసి రెండవ సీరియల్‌లేని లోటు తీర్చినారు.

ఇకపోతే సినిమా విశేషాలులో స్వామి చిత్రానికి అర్ధాంగి ఫేం పి. సాంబశివరావు దర్శకుడు అని వ్రాశారు కాని అర్ధాంగి చిత్రానికి దర్శకుడు సాంబశివరావుగారు. దాని దర్శకుడు ఎ. మోహన్ గాంధి. జి. జి. ప్రసాద్— [తిరుపూరు.]

## కథలు

3—2—78 ఆంధ్ర పత్రిక సచిత్ర వార పత్రిక ఈసారి కార్టూన్స్ ఎక్కువగా వేసినం దుకు మా హృదయ పూర్వక అభినందనలు డాక్టర్ సలహాలు శీర్షికను ఒక పేజీనిండా వేయ గలరని కోరుతున్నాము.

పి. వి. రామనాథరావు, యస్. విజయశ్రీ[మధిర]

## లోకం పోకడ—ఊమెన్















# ప్రశ్నావళి

**డి. ఎస్ — జహీరాబాద్**

రామాయణ విషవృక్షం రాసి రామాయణంలో విప్లవం తెచ్చారు రంగనాయకమ్మగారు. భారతంలో దుష్పర్భాగ్యం రాసి మహాభారతంలో మీరు తీసుకొస్తారా ?

ముందా భారతం చదివితే నాకర్థం అవుతుందా లేదా తేల్చుకోనివ్వండి. తరువాత దాని దుష్పర్భాగ్యం సంగతి చూద్దాం!

**పి బి హెచ్ — మెటుపల్లి**

మీరింత చమత్కారంగా జవాబులిస్తున్నారే ఏం వాడుతారు ?

నా స్పెషల్ కంకాక్షన్ ! [చేసిచూస్తారా. పిసరంత స్నేహం చిటికెడు సరదా, మిల్లిగిరి బెడు సహృదయం లీటరు పోసిక రంగరించి మిక్సీలో వేసి తియ్యండి గ్లాసులో ఐసువేసి ఇచ్చే ముందు హో చీమ మిరపకాయ చిదిపి వేసి కలియపెట్టండి అంతే తాగడానికి రుచి ఎక్కువ తాక్కుండాకారం ఇదే కెరా కాక్టెయిల్ ]

**వి. కె. ఆర్. ఎమ్ — హైదరాబాదు**

ఆడదాన్ని అణిగిమణిగి పడి వుండమని ప్రకృతి శాసనం.

కాదు ఒకరి సహాయం ఒకరికి అవసరమని ప్రకృతి శాసనం

**జి. ఎల్ — బొంబాయి**

నీతిగా బ్రతకాలంటే నిందలు వేస్తారెందుకు.

నీతిగా బ్రతికే వాడికి నిందలంటే భయం ఎందుకు !

**బి. ఆర్ - తిరుపతి**

మీ సమాధానాలు చదువుతూంటే మందు తుంది చూడూ, కాని అదేమో పత్రిక చూసిన వెంటనే మొదట చూసేది మీ పేజీయే కారణం ఏమిటి అంటారు.

ఏముందీ ద్వేషం ప్రేమా నాణేనికి రెండువక్క లేగాని వేరుకాదని తెలుస్తోంది. మీ ప్రవర్తన. తిట్టుకుంటూనే నా చదవడంనే మేలు, ఇగ్నోర్ చేసేకరిటే అని నా విశ్వాసం అదే మీరు నిరూపిస్తున్నారు !

**ఏ. ఎస్. ఆర్ — సాలూరు**

మీ కెప్పుడైనా భయం వేసిందా.

ఆ ! !

**ఎస్. ఎస్. ఏ — సిరిసిల్లా**

గ్రహములేల ఆడగ్రహమొకటి చాలదా<br>
ఆడిపించ మనల ఏడిపించ ?

గ్రహశాంతికి బదులు ఆడ<br>
గ్రహ శాంతికి నాందిపల్కు<br>
విద్యగ నేరక మరి<br>
ఆడుదువు సర్వ గ్రహకాలములన్ !

**ఒక ద్వేషి — నర్సీపట్నం**

జవాబులు చదువుతూంటే ఒంటికి కారం రాసుకున్నట్టుంది. ప్రశ్నావళి తీసేస్తే పత్రిక చాలా మంది చదువుతారని నా అభిప్రాయం.

తీరి కూర్చుని ఒంటికి కారం ఎప్పుడు రాసుకు చూసుకున్నావయ్యా ద్వేషీ. ఎంతమంది పాఠకులు పెరుగుతారో చెప్తే సంపాదకులకే సూచన అందిద్దాం ! !

**ఆర్. ఎస్. నందిగామ**

అక్కయ్యా, జీవితమే ఒక నాటకమా ?

కాదు చెల్లెలా ! వచ్చినట్టు సాగించవలసిన వాస్తవం.




**జి. ఎమ్ — కొత్తగూడెం**

నేను ఎన్ని ప్రశ్నావళికి రాసినా నా పేరు పత్రికలో రావడంలేదు. కారణం ఏమిటి. చాలాబాధతో ఈ ఉత్తరం రాస్తున్నాను. నా దురదృష్టమో అదృష్టమో తెలుపగలరు.

ముత్తయ్యగారూ, దేనికింత బెంబేలుపడిపోతున్నారో.... అర్థం కావడంలేదు. ప్రశ్నావళిలో మీ పేరు కంటె మీ ప్రశ్నకి కదా ప్రాముఖ్యం! ఏదీ ఆ ప్రశ్న. మీ ఉత్తరంలో ప్రశ్నలేదు ఇకేంచేయను!!

**జగదీష్. కర్నూలు**

ఆడదానికి మాంగల్యంతోనే వస్తాయి కదండీ కొత్త అందాలు

మరే ! మగవాళ్ళకి లాగే పెళ్ళి కొత్త కళ తెస్తుంది !

**యు. వి. ఎమ్మిగనూరు.**

మీ జాతి వారెప్పుడూ తమకోపాన్ని వంట సామాన్లపై చూపిస్తారు. వాటికీ మీకు మధ్య ఆకర్షణ శక్తి వుందా ?

నాకు తెలియదండి, మీ కెలా తెలిసింది ?!

**బి. జె. ఆర్ గార**

మగవారి పేంటు షర్టు ఆడవారు వేసుకొని పోజులు కొడుతున్నారే ఆడవారి చీరలు మగవారు ఎక్కడైనా కట్టుకుంటున్నారా ? సిగ్గులేదూ, ఆడవారిని వెరకేసుకు రాడానికి ?

మీరు చూడ్డం లేదా పువ్వుల లుంగీలూ ప్రింటు షర్టులూ, అవన్నీ ఏమిటో అయినా వేసుకునే బట్టల కెందుకు మనిషి కివ్వని విలువ ?

**డి. ఆర్. ఎల్. భీమునిపట్నం**

చెప్పేవి చేతల్లో చూపించే ధైర్యం కొద్ది మందికి మాత్రమే వుంటుంది. నేను నాకు నచ్చేవి ఆచరణలో పెట్టాలను కుంటాను. గాని ఏదో పిరికితనం నన్నావరిస్తుంది.

పిరికితనం స్థానే మొండితనం అలవరచుకోండి. మనసుకి నచ్చినవి తోచినది, ఇతరుల కన్యాయం కానిది ధైర్యంగా చేయడంలో తప్పులేదు.

**బి. ఎస్. ఆర్. కోనాపురం**

మీరు పత్రిక తీయగానే ఏ శీర్షిక చదువుతారు ?

ధర్మపథం, అంత కొంచెంలో ఎంతటి గంభీరమైన సంగతులు చెప్తారు. బాగుమాను అనిపిస్తుంది నాకు.

**వెంకట్, ఉరవకొండ**

న్యాయవాది నల్లకోటు ధరించడంలో అర్థం ఏమిటి ?

స్వచ్ఛమైన తెల్లని న్యాయం ప్రస్ఫుటంగా కనిపించడానికేమో.

కె. రామలక్ష్మి

# అడవి - సముద్రం

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




బసవరాజం అతి కష్టం మీద చంద్రశేఖరాన్ని పెళ్ళి చూపులకు ఒప్పించాడు !!

"నాకీ పల్లెటూరి సంప్రదాయాలూ మర్యాదలూ బొత్తిగా తెలియవు మామయ్యా - బాధ్యతంతా నీదే" అన్నాడు చంద్రశేఖరం !

'నీ కెందుకు చందూ ! నేను శ్రీకృష్ణునిలా బండి నడుపుతూ వుంటాను. నీవు అర్జునుడిలా కూర్చో -' అన్నాడు బసవరాజం ! !

చంద్రశేఖరానికి మేనమామ బసవరాజం!!

మేనల్లుడి మీద చిన్నప్పటి నుంచీ చాలా ప్రేమ ఆయనకు. అందుకే అల్లుణ్ణి ఓ ఇంటివాణ్ణి చేయాలనే సంకల్పంతో ఎన్నెన్నో సంబంధాలు చూశాడు. ఆడపిల్ల వాళ్ళు తిరిగిన దానికన్నా ఎక్కువగా తిరిగి సంబంధాలు విచారిస్తున్నాడు.

నివగాంలో పాండురంగ భుక్తగారి కూతురు పదెకరాల మాగాణీతో వస్తుందని తెలిసి మేనల్లుణ్ణి పెళ్ళి చూపులకు ప్రయాణం కట్టించాడు.

చంద్రశేఖరం ఉద్యోగానికి వో రోజు శలవు పెట్టి వో ఆదివారం కూడా కలిసి వచ్చేటట్టు చూచుకొని మామయ్యతో విశాఖ నుండి నివగాం బయల్దేరాడు.

విశాఖ నుండి ముందు ఆముదాలవలసకు బస్సెక్కారు.

బస్సు ముంత మామిడి తోటల మధ్యగా దూసుకు పోతున్నది.

చంద్రశేఖరం అనుకున్నాడు 'పిల్లమాట ఎలా వున్నా ప్రకృతి మాత్రం ఆహ్లాదకరంగా వుంది– వో పిక్నిక్‌కు వెళ్ళినట్లు.'

మధ్యాహ్నానికల్లా శ్రీకాకుళం వచ్చింది.

అక్కడ ఆర్. టి. సి. బస్‌స్టాండు వద్ద భోజనంచేసి మళ్ళీ బస్సులో కూర్చున్నారు.

చంద్రశేఖరానికి ఈ ప్రాంత మంతా కొత్త !

విజయవాడ నుండి విశాఖకు ఏడాది క్రితం ట్రాన్స్‌ఫర్ అయినా ఎన్నడూ విశాఖ పొలిమేరలు వదిలి పోలేదు ఒక్క సింహాచలానికి తప్ప !

మొదటిసారి ఇప్పుడు జిల్లా సరిహద్దులు దాటి పోతున్నాడు దుష్యంతునిలా, కన్యాన్వేషణకు ! !

ఎండాకాలం కావడంతో బస్సు దిగిన చోటల్లా తాటిముంజలుఅమ్మవస్తున్నాయి. బసవరాజం వెయించిన జీడిపప్పు పొట్లాలు కొన్నాడు.

చంద్రశేఖరం పనస చెట్లనూ, మామిడి తోపులనూ చూస్తున్నాడు. ప్రకృతివనరులు ఎక్కువ ఉపయోగించుకోవడం మాత్రం తక్కువ అనుకున్నాడు స్వగతంలో చందూ బస్సు సాయంత్రానికి నివగాం చేరింది.

నివగాం వద్ద వంశధార చాలా విశాలంగ వుంటుంది.

ఎండాకాలం కావడంతో నదిలో నీళ్ళులేవు చుటూ వందల ఎకరాలమామిడితోటలు సాయంత్రం కావడంతో లక్షల పక్షులు భూమ్యాకాశాలు పట్టనంత గోల చేస్తున్నాయి.

బసవరాజం చేసిన సూచనమేరకు నివగాం వద్దకు ముందే ఎడ్లబండి వచ్చి నిలబడి వుంది మధ్యాహ్నంనుండి బండివద్దకు స్వయంగా పాండురంగభుక్త వచ్చాడు. సిర్కావి పంచె, పొడుగుచొక్కా, చొక్కా నిండా జేబులే !!!

ఆయన వినయంచూసి చంద్రశేఖరం ఆశ్చర్యపోయాడు ముగ్గురూ బండిలో కూర్చున్నారు.

నివగాంకు ఆనుకోని కుద్దిగాం అనే అగ్రహారం వుంది. పెళ్లిచూపులు అక్కడ!!

భుక్త అతిధుల ప్రయాణాన్ని గూర్చి అడిగాడు.

'ఎండంతా మాపాలే పడింది' అని బసవరాజం తాము ఎన్ని గంటలకు బయలు దేరి ఎక్కడెక్కడ ఆగుతూ వచ్చారో ఎక్కడ భోంచేశారో, ఎక్కడ తాటిముంజలూ, టేడిపప్పు తిన్నారో అన్నీ వివరంగా చెపుతున్నాడు.

చంద్రశేఖరం మాత్రం మౌనంగా కూర్చున్నాడు.

ఎడ్లబండి ఇసుకలో సాగిపోతున్నది మెత్తగా మువ్వల శబ్దంచేస్తూ!

తాటిచెట్ల దగ్గర నిలబడ్డ గొడ్లుకాచే పిల్లలు కర్రలు మెడమీద రెండుచేతులతోనూ వంచి పట్టుకొని అతిధులను వింతగా

## అడవి - సముద్రం

చూస్తున్నారు.

బండి కుద్దిగాం చేరింది.

పొట్టి పొట్టి పందిళ్లమీదినుండి మల్లె పూల ఘుమఘుమలు. పాండురంగభుక్త వచ్చిన అతిధులకు ముందే విడిది సిద్ధంచేసి వుంచాడు.

అదొక మట్టియిల్లు!

శుభ్రంగా పేడలో అలికి ముగ్గులు పెట్టారు — ఒకమూల గాదెలు — పక్కనే ఏవో పప్పు బస్తాలు. బయట జామిచెట్టు, కొబ్బరిచెట్లు — మల్లెపందిరి. భుక్తగారి పాలేరు సిద్ధంగా వున్నాడు ఎప్పటినుంచో— బసవరాజం, చంద్రశేఖరంరాగానే కొబ్బరి బోండాలు కొట్టి ఇచ్చాడు పాలేరు —

కొబ్బరినీళ్లతో దప్పిక తీర్చుకున్నారు ఇద్దరూ. బావిదగ్గర స్నానంచేసి బట్టలు మార్చుకున్నారు.

'గతికితే అతకదని భోజనాలు మా ఇంట్లో ఏర్పాటు చేయలేదు' పాండురంగ భుక్త అతివినయంగా మనవి చేసుకున్నాడు.

చంద్రశేఖరం చిరునవ్వు నవ్వుకున్నాడు. అంటె నైవేద్యాలు తమ ఆలయానికే వస్తాయన్నమాట.

'అల్లుడగా నువ్వు హాయిగా విశ్రాంతి తీసుకో. నేనట్లా పెద్దమనుషుల దగ్గరికి పోయి అవీ ఇవీ మాట్లాడివస్తాను' అన్నాడు బసవరాజం. అంటే బసవరాజం తన పరోక్షంలో పెళ్ళివాళ్లతో కట్నాలూ కానుకలూ ఇతరత్రా విషయాలూ ఏవో కాన్ఫిడెన్షియల్‌గా మాట్లాడాలని వెళ్తున్నట్లు చంద్రశేఖరం ఊహించాడు —

బసవరాజం వెళ్ళిపోయాడు.

చంద్రశేఖరం ఆకాశంవంక చూచాడు. కుంకుమపువ్వు పొడి చేసి వెదజల్లినట్లు ప్రకృతి — నుదుట పెద్దబొట్టు పెట్టుకున్న ముసలి ముత్తైదువులా అలసిపోయిన సాయంకాలపు సూర్యుడు.

చంద్రశేఖరం మట్టిగదుల మధ్యనుండి

గాలి పీల్చుకునే నిమిత్తం బయటపడ్డాడు.

చంద్రశేఖరానికి అంగరక్షకుడుగా నియమింపబడ్డ పాలేరు వెంటబడ్డాడు.

వద్దని వారించాడు చందూ—

గడ్డల మధ్య, ఇసుక మధ్య నడుస్తూ చందూ వంశధార వైపు వెళ్ళాడు.

ఇద్దరు గొడ్లు కాచుకునే పిల్లలు 'ఎవరా? ఈ కొత్త మనిషి?' అన్నట్లు గూఢచారుల్లా కొంత దూరం ఫాలో అయి చందూ వాళ్ళ వైపు చూచేసరికి బెదిరిపోయి వెనుక ముఖం పట్టారు.

కాళ్ళు చీలమండలు తడిసే మాత్రం నీరు చాలా బలహీనంగా ప్రవహిస్తున్నది. నదిలో సూర్యుని ప్రతాపానికి కుంగిపోయి చందూ నీళ్ళల్లో నిలబడ్డాడు.

కాళ్ళచుట్టూ నీళ్ళ సుడులు తిరిగాయి సన్నగా.

రెండు చిరుకప్పలు ఇసుకలోకి ఎగిరి దూకాయి.

చిరుగాలికి ఇసుక రేగింది.

చందూ తలను తాకుతూ తెల్లని జలపక్షి ఒకటి చాలా కిందిగా ఎగురుతూ పోయింది.

చందూ ఉలిక్కిపడ్డాడు.

దూరంగా ఎవరో కిల కిల నవ్వుతున్న శబ్దం!

చందూ అటు చూచాడు.

జామచెట్లు చాటున ఎవరో ఉన్నట్లు పసికట్టాడు.

చందూ అటు నడిచాడు.

చెట్టు చాటున నవ్వులు ఆగిపోయాయి. నిశ్శబ్దం.

చందూ జామిచెట్ల లోపలు చేరాడు.

చెట్ల చాటు నుండి బెదురుతూ రెండు జతల కళ్ళు చందూను చూస్తున్నాయని చందూ గ్రహించాడు.

'ఎవరు మీరు?'

రెండు లేడి కూనలూ బెదిరిపోయాయి. పరుగెత్తడం కోసం అటు ఇటూ చూస్తున్నాయి.

చందూ వాళ్ళకు అడ్డంగా నిలబడ్డాడు.

వాళ్ళ కళ్ళలో భయం- పారిపోయేందుకు దోవలేక బిత్తర చూపులు ... చందు చిరునవ్వులతో మూడు నాలుగు మృదువాక్యాలలో ఏనమారి జింకపులను మచ్చిక చేసుకున్నాడు.

వాళ్ళకు భయం కొంచెం తీరింది

'కూర్చోండి' — యజమాని ఆజ్ఞను శిరసావహించినట్లు ఇద్దరు పిల్లలూ కూర్చున్నారు ఇసుకలో.

'మీ పేరేమిటి?'

"... ... ... ..."

మళ్ళీ అదే ప్రశ్న!!

'నా పేరు కామాక్షి — ఈమె పేరు శశిరేఖ.'

శశిరేఖ మాట్లాడటంలేదు — కామాక్షే మాట్లాడుతున్నది.

'ఏం చేస్తున్నారు ఈ తోటలో సాయంత్రం' కామాక్షి చిరునవ్వు నవ్వింది.

శశిరేఖ సిగ్గుతో తల వంచుకుంది.

'చీకటిపడితే భయంలేదా...'

'ఇంకా పడలేదుగా-అయినా నదిదగ్గర మాకేం భయం —' కామాక్షే జవాబు చెప్పింది.

'షికారుకు వచ్చేరా సాయంత్రం.'

'ఊఁ...'

'నేనెవరో మీకు తెలుసా?'

'ఊఁ' - తెలుసునన్నట్లు తల వూపింది కామాక్షి.

'నీవే మాట్లాడుతున్నావు — ఆ పిల్లకు మాటలు రావా? మూగదా?'

కామాక్షి కిలకిలా నవ్వింది.

శశిరేఖ ముడుచుకొని పోయింది—

వర్షంలోని నెమలిపించంలా.

హేమంతంలోని మంచుమధ్య కమలంలా శశిరేఖ లేచిపోవడానికి విఫల ప్రయత్నం చేసింది, చందూ మళ్ళీ అడ్డుపడ్డాడు.

'ఈమె పెళ్ళికూతురు. ఈమెను చూడడానికే మీరు వచ్చారు' కామాక్షి చెప్పింది.

శశిరేఖ తలను రెండు మోకాళ్ళమధ్య దాచుకొని ధనుస్సులా వంగింది సిగ్గుతో. చందూ ఆశ్చర్యపోయాడు.

ఇప్పుడు శశిరేఖను మళ్ళీ శ్రద్ధగా పరిశీలించాడు. కామాక్షి- శశిరేఖా ఒకే ఈడులో వున్నారు కాని కామాక్షి కన్నా శశిరేఖ చాలా అందంగా వుంది.

లేడి లాంటి కళ్ళు— కళ్ళనిండా కాటుక — ముఖాన తిలకం పెద్ద ఖరీదైనదని చెప్పలేని పరికిణీ, వోణీ, చేతుల నిండా రంగు రంగుల గాజులు, విరిసిన ఇంద్ర ధనుస్సులా— ముడుచుకున్న ముద్దబంతి పూవులా కూర్చున్నది శశిరేఖ తలవంచుకొని.

మాంగల్య ధారణ సమయంలో కూర్చున్న పెళ్ళికూతురులా!! పొడవైన నల్లని జడలో మల్లెపూల దండలు, ఇంద్ర నీలాల మాల చివర ముత్యాలలా మెరుస్తున్నాయి. 'కాదు - కాదు వంశ ధార పాయలో తెల్లని గవ్వల్లా మెరుస్తున్నాయి' అనుకున్నాడు చందూ.

కొంచెంసేపాగి 'అయితే నన్ను చూద్దామని వచ్చారన్నమాట' అన్నాడు చందూ.

కామాక్షి మళ్ళీ కిల కిలా నవ్వింది.

శశిరేఖ కళ్ళు సిగ్గుతో కుండ పోరగా వర్షించాయి.

'ఈమె బుగ్గల ఎరుపుకు సిగ్గుపడి ఆకాశం పారిపోతున్నది— ఈమె సిగ్గుతో నిండిపోయి ప్రకృతి కాటుక రంగు పూసు



## కరెన్సీ నోట్ల తమాషాలు !

★ కేంద్రం ఆర్డినెన్స్‌ద్వారా వెయ్యి, ఐదువేలు, పదివేలు విలువచేసే నోట్లని రద్దుచేశాక, శ్రీవెంకటేశ్వరస్వామి ఆలయంలోని హుండీలో రెండు లక్షల రూపాయలు విలువచేసే వేయి రూపాయల నోట్ల కట్టలు గుర్తు తెలియని వ్యక్తులు పడేశారు !

★ బొంబాయి రిజర్వు బ్యాంకువద్ద రెండు డజన్లమంది విదేశీయులు పెద్ద నోట్ల రద్దువల్ల తమకు కలిగిన ఇబ్బందిని తెలియ జేసేందుకు పెద్ద పెట్టున కేకలు, బొబ్బలు పెట్టారు.

★ బొంబాయి రిజర్వు బ్యాంకుకు సిటీ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న ఒక వ్యక్తి వచ్చి ఆస్పత్రి బిల్లులు చెల్లించడం కోసం వెయ్యి రూపాయల నోటుకు చిల్లర నోట్లు ఇవ్వవలసినదిగా కోరాడు. ఈ వ్యక్తి విషయంలో మామూలు లాంఛనాలను రద్దుచేసి కోరికను మన్నించారు.

★ సూరత్‌లో రు.1000ల నోట్లు ఒక్కొక్కటి రు.200 లకు అమ్ముతామని బేరం పెట్టారు !

★ సూరత్‌లోని స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా మెయిన్ బ్రాంచిలో ఎనిమిదేళ్ళ బాలుడు వెయ్యిరూపాయల నోటును మార్చుకోడానికి వచ్చాడు. మైనర్ గనుక డిక్లరేషన్ దాఖలు చేసేందుకు వీలు లేక, తిరిగి పోవలసి వచ్చింది.

★ సూరత్‌లోని వజ్రాల మార్కెట్‌లో ఒక వజ్రాల వ్యాపారి ఒక వెయ్యి రూపాయల నోటును సిగరెట్‌గా చుట్టి నిప్పంటించుకొని విలాసంగా కాల్చాడు. మరొక వజ్రాల వ్యాపారి నాలుగు వెయ్యి రూపాయల నోట్లపై నూనెతోచేసిన తినుబండారాలను పెట్టి ఆరగించాడు !

[సేకరణ : ప్రసాద్]

కుంటున్నది' అనుకున్నాడు చందూ.

ఆమె సిగ్గును తొలగించడం కోసం చందూ మెల్లగా ఆ మాటా ఈ మాటా మొదలు పెట్టాడు.

చందూ మాటలను వాళ్ళు శ్రద్ధగా వింటున్నారు.

'అయితే విశాఖపట్నంలో విమానాలు నేలమీదికి దిగుతాయా ?' కామాక్షి ప్రశ్నించింది.

'ఆఁ— నేలమీద కొంత దూరం పరుగెత్తుతాయి కూడా'

'అమ్మో ! అయితే మీ రెప్పుడయినా విమాన మెక్కారా ?'

'ఆఁ—'

'అప్పుడు కళ్ళు తిరిగాయా ? కళ్ళు తిరిగితే నిమ్మకాయ ముక్కలు జేబులో పెట్టుకోవాలిట మా బాబాయి ఒకసారి చెప్పాడు...'

చందూ మల్లెపువ్వులాంటి స్వచ్ఛమైన నవ్వు నవ్వాడు.

'మీరెప్పుడు విమానాలు చూడలేదా ?' చందూ ప్రశ్నించాడు.

'చూడకేం ఆకాశంలో ఎగురుతూంటే చూశాం — అయితే విశాఖపట్నం ఎప్పుడూ చూడలేదు. ఒకసారి సింహాచలం పోవలసిన అవకాశం వచ్చింది కాని మళ్ళీ మాతమ్ముడికి జ్వరం వచ్చేసరికి మానుకున్నాము —'

'మీ స్నేహితురాలు చూసిందా విశాఖ' చందూ ప్రశ్నించాడు. కామాక్షి కలకలా నవ్వింది — ఆ నవ్వు మొగలిపువ్వు నుండి

## అడవి - సముద్రం

రేగిన పుప్పొడిలా నలుదిక్కులా వెదజల్లబడ్డది !

'శశిరేఖ ఎన్నడూ శ్రీకాకుళమే పోలేదు ఇక విశాఖ మాటేమిటి ? ? — శశిరేఖ సినిమాకూడా చూడలేదు, నేను చూచానులే మా నాన్నతో శ్రీకాకుళం పోయినప్పుడు...' కామాక్షి చెప్పింది !!

చందూ శశిరేఖను చూచాడు.

శశిరేఖ ఇప్పుడు తాను పెళ్ళికూతురు నన్న విషయం మరచిపోయి కొంచెం ముందుకు జరిగి చందూ మాటలను వినడానికి చెవులూ కళ్ళూ రిక్కించి కూర్చున్నది.

చందూవాళ్ళ స్థితి గమనించాడు. ఇంకేం విశాఖ గొప్పతనాన్ని కథలు కథలుగా వర్ణించ సాగాడు — అక్కడి నౌకలూ — డాల్ఫిన్స్ నోస్, కాల్టెక్స్, యూనివర్సిటీ, రేడియో స్టేషన్, పిచ్చాసుపత్రి...

'అయితే పిచ్చాసుపత్రిలో...' కామాక్షి ఆసక్తితో ఏదో అడగబోయి 'వద్దులెండి — పిచ్చివాళ్ళగూర్చి మాకు చెప్పవద్దు—భయం' అన్నది.

'ఈ నదిదగ్గర చీకట్లో భయంలేదా ?' అన్నాడు చందూ —

'మా అక్కదగ్గర మాకేం భయం — ఇది నదికాదు మా అక్కా!' అన్నది కామాక్షి.

'అలాగా' అన్నాడు చందూ.

'ఔను — ఒకసారి వర్షాకాలంలో ఈ తోటల్లోకి పెద్దపులి వచ్చింది — దానిని జగన్నాథస్వామి తరిమేశాడు.'

'జగన్నాథస్వామి ఎవరు, పూరీలో దేవుడా ?'

చందూ అమాయకత్వానికి కామాక్షి మళ్ళీ నవ్వింది.

జగన్నాథస్వామే నీకు తెలీదా ? అన్నట్లు చూచి "శశిరేఖ మేనమామ— వాళ్ళమ్మకు రెండో తమ్ముడు" అన్నది.

'జగన్నాథస్వామి అంత పరాక్రమవంతుడా ?' అన్నాడు చందూ.

'ఆఁ— ఒకసారి వర్షాకాలంలో ఈ నదిలో కొండచిలువ కొట్టుకువస్తే దాన్ని ఒకే దెబ్బకు జామతోటలో చంపేశాడు' శశిరేఖ నోటివెంట ముత్యాలు రాలాయి.

'ఈ వూళ్ళో వున్నాడా ? ఇప్పుడు ?' చందూ ప్రశ్నించాడు.

'లేడుగా ! శశిరేఖను జగన్నాథానికి చేసుకోవాలని మా గౌరమ్మత్తకు— అంటే జగన్నాథం అమ్మకు కోరిక. అయితే మా పాండురంగం మామ 'నా కూతురు లక్ష్మీదేవి— ఈమెను ఎవరైనా ఆఫీసరుకే ఇస్తాను' అన్నాడు. అందుకని కోపంవచ్చి కొడుకుతో కుద్దిగాం వదిలి పర్లాకిమిడి వెళ్ళిపోయింది.'

'జగన్నాథమంటే నీకిష్టమా ?' చందూ శశిరేఖను అడిగాడు. శశిరేఖ సిగ్గుతో తల వంచుకుంది.

అయితే చీకట్లు ముసరడంతో ఆమె బుగ్గల రంగును చందూ పోల్చుకోలేక పోయాడు.

కామాక్షి మాత్రం విదురుప్రశ్న వేసింది. 'ఇష్టమంటే ఏమిటి ?'

'అంటే— పెళ్ళి చేసుకోవాలన్న కోరిక.'

కామాక్షి ఒక్క క్షణం ఆగి అన్నది 'మా వూళ్ళో ఆడపిల్లలకు అలాంటి కోరికంటూ ఏమీ వుండదు— మా అమ్మా నాన్నా ఎవరినిచ్చి పెళ్ళి చేస్తే ఆ రోజు నుంచీ ఆయనే మొగుడు.'

పలచని వంశధారలో చంద్రోదయం ప్రతిబింబించింది.

'అవును— సూర్యోదయమూ ప్రతిబింబిస్తుంది-చుక్కలూ ప్రతిబింబిస్తాయి — ఈ నది వీళ్ళకు అక్క !' అనుకున్నాడు చందూ !!.

ఆ తర్వాత కామాక్షి ఏమిటో చెపుతున్నది శాఖాచంక్రమణంచేస్తూ అంశాలను.

ముందు కుద్దిగాం చరిత్ర చెపుతున్నది. వాళ్ళ ఊరివెలుపల మాకవరంలో నీలకంఠేశ్వరుని కోవెల వుందిట ! వర్షాకాలంలో గుడి మునిగిపోతుందిట ! నూరేళ్ళక్రితం ఈ అడవుల్లో తాటాజు అనే సవరరాజు ముఠా దోపిడీలు చేసేదట — దొరలు దాన్ని అణిచారట !

కొన్నాళ్ళ తర్వాత ఈ గ్రామం నదిలో కలిసిపోతుందిట ! అప్పుడు ఈ గ్రామస్థులంతా ఎక్కడో ఇళ్ళు కట్టుకోవాలిట !!

'అమ్మో ! చీకటి పడింది —' అన్నది శశిరేఖ — కామాక్షి, శశిరేఖలు చివాలున లేచి నిలబడ్డారు.

'వస్తామండీ !' కామాక్షి మాత్రం వీడ్కోలు చెప్పింది.

శశిరేఖ ఒక్కసారి చంద్రశేఖరాన్ని చూచి పిస్సతో చీకట్లో పారిపోయింది.

రివ్వున మామిడిచెట్టు మీదినుండి దూసుకుంటూ ఓ నల్లని కోయిల నది అవతలి తోటలోకి పోయింది 'కుహూ — కుహూ—' మంటూ చందూ నెత్తిమీని గుండా' !

చంద్రశేఖరం మరి కొంతసేపు అలాగే కూర్చున్నాడు కదలకుండా.

దూరాన మనుషుల మాటలు —

తోటల్లో కోకిలల అరుపులు —

నదిలో కప్పల చిరు శబ్దాలు —

ఎక్కడో దూరంగా కీచురాళ్ల శబ్దం —

కుద్దిగాం గ్రామం మొత్తం బుడ్డి దీపాలతో అలంకరించుకుంది, చుక్కలతో అలంకరించుకున్న ఆకాశంలా 'కాదుకాదు తోలుబొమ్మలాటలో దీపంముందున్న తెర మీది బొమ్మలాటలా వున్నది ఈ గ్రామంలోని జీవితం లాంతర్ల వెలుగుల మధ్య' అనుకున్నాడు చంద్రశేఖరం...

అలా ఎంతసేపు తన్మయుడై కూర్చున్నాడో తెలియదు. 'చందూ— చందూ' అన్న బసవరాజం కేకతో ఈ లోకానికి వచ్చాడు

'చందూ— చందూ' మళ్ళీ బసవరాజం కేక.

'ఇక్కడున్నాను మామయ్యా'

గొంతును గుర్తుపట్టి వచ్చారు మనుషులు.

బసవరాజం, పాలేరు, పాండురంగ భుక్త ఇంకెవరో ఒకరూ.

'నీవు కనపడక పోయేసరికి వెతుకుతూ వచ్చాం' అన్నాడు బసవరాజం.

'ఔను— కొత్త ప్రదేశం కదా బాబూ— పురుగూ పుట్రా ఉంటాయి చీకట్లో' — వినయంగా అన్నాడు పాండురంగ భుక్త.

చంద్రశేఖరం లేచి నిలబడ్డాడు.

వాళ్ళను అనుసరించాడు.

ఆ రాత్రి చంద్రశేఖరం— బసవరాజాలకు కుద్దిగాంలో విందు భోజనం— దంపిన బియ్యపన్నం, సువర్ణరేఖల మామిడిపండ్లూ, గడ్డపెరుగు, ఆవునెయ్యీ— పనసతొనలూ' పాయసం. భోజనం కాగానే బసవరాజం గుర్రుపెట్టి నిద్రపోయాడు.

కాని చంద్రశేఖరానికి నిద్రపట్టలేదు. గాలి తిరుగుతున్న కొద్దీ మామిడిపళ్ళ వాసనలు, మొగలి పొదల వాసనలు, మల్లె పందిళ్ళ వాసనలు, ఏ రాత్రి నిద్రపట్టిందో ఏమో తెల్లవారు జామున పాలేరు పిలుపుతో మెలకు వచ్చింది— కోళ్ళు కూస్తున్నాయి.

పాలేరు అతిధులకు కాలకృత్యాలకై లేపాడు— బసవరాజం, చంద్రశేఖరం నది తీరానికి బయలుదేరారు— వెనకాల లాంతరు పట్టుకొని పాలేరు— నీటితోతడిసి రాత్రంతా చల్లబడ్డ మట్టి ఒక విచిత్రమైన సహజ గంధాన్ని వెదజల్లుతున్నది వంశధార ఒడ్డున!

'అబ్బ! మట్టికి యింత సువాసన వుందా?' అని ఆశ్చర్యపోయాడు చంద్రశేఖరం—

'బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభంలో చేసిన మొదటి ఊహలా వుంది ఈ పల్లెటూరు ఈ తెల్లవారుజామున' అనుకున్నాడు చంద్రశేఖరం !!

మెల్లగా తూర్పు రేఖలు తెల్లవారాయి!!

సూర్యుడు పైకి వచ్చాడు.

అతిధు లిద్దరికీ— ఉప్మాలూ, కాఫీలూ.

తర్వాత పెళ్ళిచూపులు—

శశిరేఖను సర్వాంగ భూషితగా అలంకరించారు— బుట్ట లోలాకులూ, కాసుల



పేర్చూ, వడ్డాణం, నుదుట కల్యాణతిలకం మొగలపూల జడ– చుట్టూ కొందరు ముత్తైదువులు కూర్చున్నారు.

చంద్రశేఖరం శశిరేఖను చూచాడు.

'ఎంత అందం! ఎంత అమాయకత్వం! ఈ పిల్లను చేసుకున్నవాడు ధన్యుడు' అను కున్నాడు చంద్రశేఖరం !

పెళ్ళిచూపులు ముగిశాయి.

ఇక బయాలుదేరుతామని బసవరాజం ప్రయాణం కట్టాడు.

ఉండమని బలవంతం చేశాడు భుక్త !

'కనీసం భోజనాలు చేశయినా వెళ్ళదురు' అని వేడుకున్నాడు చేతులు పట్టుకొని.

'వద్దు– మరీ ఎండవేళ పోలేము' అని బసవరాజం అప్పుడే బట్టలు సర్దేశాడు.

విధిలేక భుక్త బండి కట్టించాడు.

చంద్రశేఖరం, బసవరాజం బండెక్కారు.

బండి నదిలోని ఇసుకనుండి పోతున్నది.

చందూ చూచాడు రాత్రి తాను కూర్చున్నచోటు– ఆ గట్టు –జామిచెట్టు– వాటి చాటున మిలమిలలాడే రెండు జతల లేడికళ్ళు

నదిలో చుక్కల ప్రతిబింబం !!

చంద్రుని ప్రతిబింబం

ముగ్ధ మనోహరంగా చీకటిలో మసక మసకగా వెలిగిన ప్రకృతి.

చంద్రశేఖరం ఒక్కక్షణం వర్తమానాన్ని మళ్ళీ మరచిపోయాడు.

'బాబూ - దిగండి' పాలేరు నివగాం వద్ద బండిని ఆపాడు. బండి అప్పుడే నివగాం వచ్చింది.

సూర్యుడు చురచుర పొడుస్తున్నాడు. కుద్దిగాం కనుచూపు దూరంలో వుంది.

దూరాన బస్సు శబ్దం –

'దేవుడు సృష్టించిన రాజ్యంనుండి మానవుడు నిర్మించిన రాజ్యంలోకి వచ్చాను' మళ్ళీ అనుకున్నాడు చందూ –

'వెళ్ళగానే జాబు రాస్తాము' అన్నాడు బసవరాజం.

'చిత్తం – మీ దయ దాని భాగ్యం' అన్నాడు పాండురంగభుక్త. బస్సెక్కారు ఇద్దరు అతిథులూ.

బస్సు కొత్తూరు పంచాయితీ సమితి వైపుకు దూసుకుపోయింది !!!

బసవరాజం చంద్రశేఖరాన్ని ఒకటి రెండు సార్లు పలకరించడానికి ప్రయత్నించి విఫలు డైనాడు.

చంద్రశేఖరం ఏ యేలోకాలలోనో ఏమి టేమిటో ఆలోచిస్తున్నాడు.

సాయంత్రానికి మళ్ళీ విశాఖపట్నం చేరా రిద్దరూ.

చందూ మళ్ళీ డ్యూటీలో చేరాడు.

రెండు రోజుల తర్వాత ఓ సాయంత్రం బసవరాజం చందూను అటు బ్యాంక్‌నుండే ఏకాంతానికి తీసుకుపోయాడు సముద్రం వైపుకు

'మరి వాళ్ళకు జాబు రాయాలి' అన్నాడు బసవరాజం. చందూ కలక్టరేట్‌కు దిగువ బీచ్ ఒడ్డున సముద్రాన్ని చూస్తున్నాడు.

కెరటాలు లెక్కబెడుతున్నాడు.

'అన్నివిధాలా అనుకూలంగా వుంది – నీకూ నచ్చినట్లే వుంది – మరి నీవు ఫార్మల్‌గా ఊఁ – అంటే చాలు...'

'మామయ్యా !' చందూ బసవరాజం కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

'ఏమిరా !'

'నాదొక కోరిక మామయ్యా ! నెరవేరు స్తావా !'

'ఏమిటి... ?'

"... ... ... ఏమిలేదు మామయ్యా శశిరేఖను ఎలాగైనా జగన్నాధస్వామికి ఇచ్చి పెళ్ళి జరిగేటట్టు చూడు.'

బసవరాజం నిర్వెరపోయాడు –

అప్పుడు చందూ ఆనాటి సాయంత్రం తాను నదిఒడ్డున కూర్చోవడం, వాళ్ళు రావడం, ఆ విశేషాలు చెప్పాడు.

"అంతే మామయ్యా ! నీకు ఏం కావా లంటే అది ఇస్తాను – ఎంత డబ్బు ఖర్చు అయినాసరే నేను ఇస్తాను – వాళ్ళకు పెళ్ళి జరిగేటట్లు చూడు పాండురంగభుక్తతో చెప్పి–"

కొంచెం ఆగి అన్నాడు బసవరాజం "ఆ పల్లెటూరి పిల్ల నాకు నచ్చలేదని డైరెక్టుగానే చెప్పరాదూ – ఈ డొంక తిరుగుడు దేనికీ ఆ పిల్ల జగన్నాధాన్ని ప్రేమించిందని నీ ఉద్దేశమా ?"

బసవరాజం కళ్ళల్లోకి చంద్రశేఖరం విచిత్రంగా చూచి అన్నాడు 'మామయ్యా ! నీవు అంతకన్నా ఎక్కువ స్థాయిలో ఆలో చించలేవని నాకు తెలుసు. నీవేకాదు ఆఫీసర్ల

# అల్పమైనా అధికమే!




బులుసు వేంకట రమణయ్య

మనం సుఖంగా జీవించాలంటే తినడానికి తిండి, కట్టుకొనుటకు వస్త్రాలు, నివసించడానికి ఇల్లు అవసరం. వాటికి ధనం కావాలి.. ఇతరులు సంపాదించి వాటి సౌకర్యాలు కలుగజేస్తే, వారిపై ఆధారపడి కాలం గడపడంకంటె స్వయంగా ధనం సంపాదించి, ఆ సౌకర్యాలు తానే కలిగించుకోవడం ఉత్తమోత్తమం. ఈ విషయాన్ని ఆలోచించే మనవారు ఎన్నడో వివిధములైన వృత్తులను ఏర్పాటు చేశారు. వ్యవసాయం, పరిశ్రమలు, విద్యాబోధన మున్నగునవి ఆ వృత్తులు. ఆవృత్తులను చేపట్టినవారు అత్యాశకూ అధికలాభాపేక్షకూ లొంగకుండా న్యాయమైన రీతినే ధనాన్ని సంపాదించ వలసి ఉంటుంది. ఈరీతిని పని చెయ్యడానికి ఆసక్తి, ఓపికా ఉండాలి. కొందరు సోమరిపోతులు కష్టపడకుండానే ధనాన్నిసంపాదించ దలచి, అందులకై వివిధ మార్గాలను ఆలోచిస్తూ ఉంటారు. వారికి న్యాయాన్యాయాలతో పని లేదు. ఇతరులను మోసగించడంలోనూ దొంగతనంలోనూ నేర్పు చూపి, ధనం సంపాదించి జీవనం గడుపుతారు. అట్టివారు శ్రీమంతులయి ఉగు మనుష్యంవలె నటిస్తున్నా ఎప్పుడో ఒకప్పుడు తాము చేసిన పనులకు తగిన ప్రతిఫలం పొందకపోరు. అన్యాయార్జితమైన ధనం అధికంగావున్నా, దానికంటె న్యాయమార్గంలో సంపాదించినది స్వల్పమైనా ఎంతో మేలు. ఈ విషయాన్నే క్రింది శ్లోకం వివరిస్తున్నది—

"అకృత్వా పరసంతాపం
అగత్వా ఖల నమ్రతామ్,
అనుత్సృజ్య సతాం వర్త్మ
యత్ స్వల్పమపితద్బహు."

ఇతరుల వద్ద పనిచేసినా ఆపనికి ప్రతిఫలం గురించి వారితో తగాదా పెట్టుకొని, వారి మనస్సునకు నొప్పి కలిగించ కూడదు. ఎక్కువ డబ్బు యిచ్చినా, దుర్మార్గులవద్ద పనిచేస్తూ వారిఅడుగులకుమడుగులొత్తుతూ తలవంచి తన హీనతను ప్రకటించకూడదు. ధనాశతో పెద్దలు నడిచే మార్గాన్ని విడిచిపెట్టకూడదు. ఇలా నడుచుకుంటూ సంపాదించిన ధనం స్వల్పమయినా అది అధికమనే అనుకొని సంతృప్తి పొందాలి అని దీని అభిప్రాయం. తాను త్రికరణ శుద్ధిగా ఉత్తముడని పేరు తెచ్చుకోవాలంటే పయి విధంగా నడుచుకోవడం అవసరం:

---

మోజులోవున్న పాండురంభుక్త కూడా ఆలోచించలేదు. అంతేకాదు నీకు తగిన సమాధానం ఎలా చెప్పాలో నాభావాలు వాక్యాలలో ఎలా చెప్పాలో కూడా నాకు చేతకావడంలేదు మామయ్యా!

మామయ్యా! మొన్న మనం చూచిందొక సుందర స్వప్నం— ఇప్పుడు మనం వున్నదొక పీడకలలో—

మనమీ పీడకలలే కొన్నిదశాబ్దాలుగా అలవాటుపడిపోయాము.

ఈ జీవితాన్నికాదని మనం కుద్దిగాంలో స్థిరపడి పోలేము.'

'ఔనురా! ఆ ప్రకృతి ఆహ్లాదకరంగానే వుంటుంది— కాని అడవిలో కాపురం చేయలేమని నీ భావం— అడవిని ఒక కాన్వాసు మీద చిత్రించి షో రూంలో అలంకరించుకుంటామని మాత్రమే నీవంటావు— అంతేనా?'

"అంతేకాదు మామయ్యా! అడవిలోని లేడిని నగరంలోని జూలో పెడితే లేడికి కృత్రిమ సౌకర్యాలు లభించవచ్చునేమోగాని అది తన స్వేచ్ఛనూ. సహజత్వాన్నీ సర్వస్వాన్నీ కోల్పోయినట్లే మామయ్యా! ఈ జనసముద్రంలో మునుగుతూ తేలుతూ అందని ముత్యాలకోసం అడుగుకు అట్టడుగుకు ఇంకా ఇంకా కోరికల వలలలో వెళ్ళి వెరుకుతున్న జాలరులం మనం!!!

పూలలో పుప్పొడిలో చెట్టులో చామలో ప్రకృతిలో వారూ ఒక భాగంగా మారిపోయిన జింక పిల్లలు ఆ జీవులు. శశిరేఖ బస్తీలో వో రిక్షా ఎక్కి సినిమాహాలుముందు క్యూలో టిక్కెట్టుకోసమో రేషను షాపు ముందు కిరసనాయిలుకోసమో నిలబడే దృశ్యం నేను ఊహించలేను— ఆ సౌందర్యానికి ఆ నదీతీరమే చక్కని బాక్—గ్రౌండ్!! ఆ జామిచెట్టే అందమైన కాన్వాస్— మామయ్యా! నా హృదయం నీకు ఎంతవరకు చెప్పగలిగానో లేదో మరి.. శశిరేఖంటె నేను ఎంత ఇష్టపడ్డానో చెప్పలేను మామయ్యా— అందుకే ఆమె నీ పాగ గొట్టాల జీవితంలోకి లాగి మైలపరచలేను అలాగని నేనా మట్టి గదుల్లోకి వెళ్ళి అక్కడే జీవించనూలేను. ఇది వాస్తవంతో కలిసిన ఆదర్శం తెలిసిందా... ఈ కళాత్మక నిర్ణయాన్ని మీరంతా అభినందించలేక పోవచ్చు అయితే ఇందులో నా త్యాగం కూడా చాలా వుంది" చందూ ఆగాడు— అతని కళ్ళు ఎందుకో చెమ్మగిల్లాయి.

బసవరాజం కళ్ళు ధగధగ మెరిశాయి— సముద్రం ఒకటే హోరు పెడుతున్నది!!




"...బావా నిన్న సాయంత్రం అక్కయ్య గురించి నాన్న నీతో మాట్లాడ్తుండగా విన్నాను. అక్కయ్యపై నీ అభిప్రాయం ఏమిటి?"

"కవితా... నువ్వూ ఇలాగే అంటు న్నావా ?"

"ఔను బావా! అక్కయ్య పెళ్ళి జరిగి తేనేగానీ నాన్న మనసు కుదుట పడదు. నువ్వు చూస్తూనే వున్నావుగా నాన్నెలా బాధ పడ్తున్నారో... బావా నా మాటపై నీ కేమాత్రం ప్రీతివున్నా అక్కయ్యను చేసుకో. మా కుటుంబానికెంతో సహాయ పడిన వాడౌతావు" అంది కారుతున్న కన్నీరు తుడుచుకోలేక.

"కవితా... నీ కుటుంబం కోసం నీ జీవితాన్నే త్యాగం చేస్తానంటావా !" అంటూ కన్నీరు తుడిచాడు.

"త్యాగంకాదు బావా! బాధ్యత. మా ఇంటికి మగబిడ్డ లేనందున, మా అక్కయ్య తర్వాత నేనే గనక నాపై కొంత బాధ్యత ఉంది. బావా మా పరిస్థితులన్నీ తెలుసు నీకు...వివరించాల్సినవసరంలేదు. మీ సంభాషణ అక్కయ్య విన్నట్టుంది. అది బాధ

*(గత సంచిక తరువాయి)*

పడ్తుంది బావా..."

"నీ తృప్తి కోసం పెళ్ళాడనా..."

"మనస్ఫూర్తిగానే..."

"నా మనసు నీ దగ్గరుందిగా" ఆవేదన నిండిన స్వరంతో అన్నాడు.

"దేనికి బావా మాటలతో చిత్రవధ చేస్తావ్ ? ఒక్కసారి నాన్న పరిస్థితి ఆలోచించు. ఆయన బాధకు అంతులేదు బావా! ఈ మధ్య అనారోగ్యంగా బాధపడుతున్నారు. అక్కయ్య పెళ్ళి జరిగితే కొంచెం కుదుట పడగలరు. అంగీకరించవా !" ఏడుస్తూనే బతిమిలాడు తున్నట్టుడిగాను.

"అలాగే" అని మాత్రం అనగలిగాడు.

"బావా ! ఎంత మంచి వాడవి నువ్వు ...నీ కెప్పుడూ ఋణపడే ఉంటాం బావా!" ఏడుపులోనే నవ్వుతూ అన్నాను.

చీకటి పడింది. దీపాలు వెలిగాయి. బావ కళ్ళలో నిల్చిఉన్న నీరు ఆ దీపాల వెలుగులో స్పష్టంగా కన్పించింది నాకు.

అయినా నేనేం చేయను ? సముదాయించలేను. నేనేగా ఆ కన్నీటికి బాధ్యురాల్ని !!

అక్కయ్య పెళ్ళి బావతో జరిగిపోయింది. నాన్న ఆనందానికి హద్దు లేక పోయింది. నాన్న సంతోషం చూస్తూ, నాలో నేనే తృప్తి చెందాను.

ఈ పెళ్ళి హడావుడిలో నా కాలేజీ సంగతి పట్టించుకోలేదు. బి. ఎస్సీ లో చేరబోయేసరికి సీట్లన్నీ నిండిపోయాయి. ఎంట్రెన్స్ కెళ్ళలేక పోయాను. డాక్టరు కావాలనుకున్న నా కోరిక కోరికగానే మిగిలి పోయింది. ఏ కోరిక తీరిందని ఈ కోరిక తీరేందుకు అనుకున్నాను.

గుంటూరు కాలేజీలో చేరాను.

ఆదివారం యింటికి వెళ్తే బావ ఎప్పటిలా నాతో ఫ్రీగా మాట్లాడ్టం మానేశాడు ముభావంగా ఉంటున్నాడు. అక్కయ్యతో నన్నా బాగుంటున్నాడో లేదోనని నాకు అనుమానం వచ్చినా కాదని సరిపెట్టుకున్నాను.

నా రూమ్ మేట్ సావిత్రితో స్నేహం పెరిగింది. ఇంతలో సునీత దగ్గర్నుండి లెటరొచ్చింది.

"ప్రియమైన కవీ !

నీవక్కడ చదువుతున్నావని సరిత ద్వారా

తెల్సింది నాకు మహా కోపమొచ్చిందిలే లేకపోతే నాకు చెప్పకుండా వెళ్తావా! ఎంత చదువులో ఉన్నా లెటర్స్ వ్రాయటం మర్చిపోకు ఎదురు చూస్తుంటాను నీ రిప్లై కై — నీ సునీ."

తన కాపురం గురించి ఒక్క ముక్క కూడా వ్రాయనందుకు నాకేదో వెలితి కనిపించింది. నా కసలు ఉత్తరాలు వ్రాయాలన్నా మహా విసుగు. సరిగా ఎవరికీ జవాబివ్వను. ఇక్కడి కొచ్చిన కొత్తలో సరిత వ్రాసినదానికింకా జవాబివ్వలేదు. నాన్న దగ్గర్నుంచి ఈరోజే వచ్చింది మరో ఉత్తరం. ముందుగా నాన్నకు వ్రాసి సునీతకు వ్రాశాను

"ప్రియమైన సునీ:

మీ కాపురం చల్లగా పారే గోదారిలా సాగాలని ప్రార్థిస్తున్నాను. నీ కవితా' అంతకన్నా మరేమీ వ్రాయలేదు.

రోజులకేం హాయిగా ఏ బాధ్యతా, దిగులు లేకుండా చక్కా దాటుకుంటూ పోతున్నాయి. 'ఆ పారె గోదావరిలో తుఫాన్లుంటాయి కవితా!'' అంటూ ఎప్పటికో జవాబు వ్రాసింది ఎందుకలా వ్రాసిందో అర్థం కాలేదు. పరీక్షల దొరణిలో మర్చేపోయాను ఆ విషయం గూర్చి సావిత్రి, నేను పరీక్షలు బాగానే వ్రాశాం క్వార్టర్లీ పిదప ఇంటి కెళ్ళినా బావ నాతో ముభావంగానే ఉన్నాడు. అందుకే హాఫియర్లీ పిదప ఏవో వంకలతో ఇక్కడే గడిపాను ఇక వేసవి కాలం సెలవులుకూడా వచ్చేశాయి. సావిత్రి సెలవు దొరికితే చాలు వచ్చా వాళ్ళ ఊరెళ్తుంది. ఇప్పుడు కూడా వెళ్ళేందుకు సిద్ధమౌతూ నన్ను ఆహ్వానించింది.

"మా ఊరికి రావే కవితా! చాలాసార్లు పిలవాలనుకుంటూ సంకోచిస్తున్నాను."

"ఇప్పుడా కుదరదు లేవే. నాన్న రమ్మంటూ వ్రాశారు."

"రెండ్రోజుల కోసమైనా రారాదా!"

"సారీ... ఏమీ అనుకోకే. ఇంటికెళ్ళి చాలా రోజులయింది. వీలు చూసుకుని వచ్చే ప్రయత్నం చేస్తాను. అడ్రసివ్వు"అన్నాను.

"తప్పకుండా రావాలి. నేను రోజూ మరి ఎదురు చూస్తుంటాను" అంటూ అడ్రసిచ్చి వెళ్ళిపోయింది.

ఆ రోజే నేను ఇంటి కొచ్చేశాను. మొన్ననే బావకు బదిలీ అయితే అక్కా బావ వెళ్ళిపోయారట. ఇంట్లో పరిస్థితులు చాలా కష్టంగా ఉన్నాయి. నాన్నకొచ్చే జీతం మా చదువులకు చాలకున్నది నా పెళ్ళి జరగాలని అమ్మకు తొందరగా ఉంది.

"నా చదువు పూర్తయేవరకూ పెళ్ళి ప్రసక్తి వద్దమ్మా" అనేశాను.

"చదువు వద్దమ్మా ఇక చాలించు. మన పక్కింటి లలిత చూడు నీ యీడుది. అప్పుడే ఓ బిడ్డ తల్లైంది."

"అమ్మా ఎవరి అంతస్తుకు తగ్గట్టు వారుంటారు లలిత ఒక్కగానొక్క కూతురు. ఆమెకు నాకు ఎక్కడ ?...అన్నట్టు సునీత వచ్చిందా ఎప్పుడైనా?"

"లేదమ్మా. అప్పుడెప్పుడో కనిపించి మీ చెల్లి భరతని పలకరించిందట చాలా చిక్కిపోయిందట"

"వాళ్ళింటి కెళ్తానమ్మా" అనేసి సునీత ఇంటికెళ్తే సునీత అత్తారింట్లో ఉందంది ఆమె తల్లి అక్కడికే వెళ్ళాలని బైల దేరాను. ఇప్పటి వరకూ మర్చిపోవాలని ప్రయత్నించిన రామకృష్ణ గుర్తురాగానే నాకు తెలీకుండానే గుండె వేగంగా కొట్టుకుంటుంది కాలేజీకూడా లేదాయె ఇంట్లోనె ఉంటాడేమో! లేకపోతే షికారు వెళ్ళి ఉండొచ్చు ఈ విధంగా ఆలోచించుకుంటూ ఇల్లు చేరాను. బైటవసారాలో ఈజీచైర్‌లో ఉన్న రామ కృష్ణను చూస్తూనే గేటు నెట్టుతూ వెనక్కడుగేశాను. గేటు కిర్రుమంది ఎటో చూస్తున్న తను చూశాడు నావైపు. నేను చూస్తూ మరో అడుగు వెనక్కేసాను. అతనే నవ్వి తలుపు తెరుస్తూ నా కళ్ళలో సూటిగా చూశాడు. నేను తలొంచు కున్నాను.

"కవితా!... బాగున్నావా?" అతనికళ్ళు ఆనందంగా మెరుస్తున్నాయి. నేను మౌనంగా ఉండిపోయాను,

"చదువుతున్నావా?" అనడిగాడు.

"సునీత ఏం చేస్తుంది?" దేనికీ జవాబు చెప్పకుండా అడిగాను.

"ముందు లోపలికి రా! నీ ఫ్రెండు ఏ పేరంటానికి... వెళ్ళిందో యేమో."

"రేపొస్తాను...వచ్చివెళ్ళానని చెప్పండి"

"కవితా..." బాధగా పిల్చి అన్నాడు. "అనుకోకుండా కనిపించి నా మనసు నానంద పరచావు?" అన్నాడు.

"రా కవితా... స్నేహితునిగా ఆహ్వానిస్తున్నాను" అంటూ లోపలికి దారితీస్తే వ్రతాన్ని అనుసరిస్తూ హాల్లోకెళ్ళాను.

ఇంతలో సునీత వచ్చింది.

"కవితా!" అంటూ కౌగిలించుకుంది.

"బాగున్నావా సునీ?ఏం! ఇలాచిక్కావు"

"నువ్వా! నేనా! బాగా వ్రాశావా?"

రానని తలూపాను.

"ముందు కూర్చోనిస్తావా?" ఇంత సరదా నవ్వుల్నే లికించి అన్నాడు

"మర్చాను. కూర్చోవే. మీ ఫ్రెండ్‌తో మాట్లాడుతుండు నే కాఫీ తెస్తాను" వెళ్ళిపోయింది

"ఆగవే. నాకిప్పుడేమీ వద్దు. కాఫీ టిఫిన్లు ఎప్పుడైనా తీసుకునేవే. కాని మనం కలుసుకోవటం చాలా అరుదుగా కూర్చో. రామకృష్ణగారూ మీరూ కూర్చోండి" నేనూ కూర్చుంటూ అన్నాను. ఆ పిలుపుకు అతను కొంచెం ఉలిక్కిపట్టం గమనించాను, ముగ్గురం కూర్చున్నాం.



"నీ కెవరైనా (ఫండున్నారా అక్కడ?"

"ఆఁ సావిత్రి అనే అమ్మాయి వుంది" అన్నాను.

"ఆమె స్నేహంలో పడి నన్నుమర్చావా?"

"మ రి సై్త ఇ లా ఎందుకొస్తానే" నవ్వుతూ అన్నాను.

రామకృష్ణ ఎటో చూస్తూ సంభాషణ వింటున్నాడు

"వచ్చిన వారి రాక ఇష్టంలేనట్లు మౌనంగా ఉన్నారు మీ శ్రీవారు."

"అబ్బే అదేమీకాదూ... వారి అలవాటే అంత" ఆ మాటల్లో కొంచెం తడబాటు గమనించాను.

మౌనంగా ఉన్నట్టుండి అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయాడు.

"నా రాక మీ వారికి కష్టం కలిగించిం దనుకుంటాను...'!

"ఛఛ అదేంలేదే! వ లు గు ర్లో వారెప్పుడూ ఫ్రీగా కూర్చోలేరు."

"మాటెందుకు తడబడుతుంది" సూటిగా అడిగాను.

"తడబాటా... ఎక్కడా?"

"సునీ... మీ కాపురం ఎలా సాగుతుందో నిజంచెప్పవే. లేకపోతే నే చచ్చినంత ఒట్టు" ఒట్టేసుకోవటం మా కలవాటు.

"ఛఛ అదేంమాటరే పిచ్చిపిల్లా!"

"పారే గోదావరిలో తుఫానుంటాయని వ్రాశావు. అప్పుడే నా కనుమానం వచ్చింది. నిజం చెప్పవే." నిలదీశాను.

"నీతో ఏమని చెప్పనే నే కోరిన వారితో నా వివాహం జరిగేట్టు చేశావు. కానీ వారు నన్ను ప్రేమించలేదని స్పష్టంగా చెప్పేశారు. దంపతులమన్న మాటేగానీ వారెవరో నేనెవరోలా ఉంటున్నాం. ఈ విషయం మా అత్తామామలకు తెలియదు. అందరిముందు బాగా ఉంటారు. కానీ ఈరోజెందుకో ఇలా ప్రవర్తించారు. కొత్తవారిముందు బాగానే ఉంటారు." దాని కళ్లతోపాటు నా కళ్ళూ తడిసాయి.

"నీ కాపురం ఇలా వుందా సునీ!" ఏడ్చాను.

"నువ్వు బాధ పడ్తావనే నీ ముందు దాచాలనుకున్నా బైట పడిపోయింది..."

"సునీ నువ్వేం బాధ పడకు. ఆ దేవుని కృపవల్ల తప్పకుండా నీ కాపురం చక్కబడు తుంది. మీరెంతో అన్యోన్యంగా ఉండేరోజు

## పూర్తికాని డైరీ

తప్పకుండా వస్తుంది. వెళ్తానేం?!"

కన్నీరు తుడుచుకుని అన్నాను.

ఇంటికెళ్ళి ఈ విషయమే ఆలోచిస్తూ కూర్చున్నాను. ఏ కలతలు లేకుండా హాయిగా సునీత కాపురం సాగిపోవాలని నా కోరిక.

మర్నాతడన్ని వంటరిగా కలవాలనుకున్నా.

"భరత ఈ చీటి రామక్రిష్ణ కిచ్చిరా! చూడు సునీత చూడకుండా ఇవ్వాలి. అది వుంటే ఏం లేదని వచ్చేసెయ్" అని పంపాను.

ఇంటి కెళ్లగనే రామకృష్ణే ఎదురవటం వల్ల అతనికే ఇచ్చేసిందట భరత.

మర్నాడతన్ని కలవటాన్కి సాయంత్రం అయిదింటికి బైలుదేరి వెళ్లాను. నాకన్నా ముందే వచ్చి ఎదురుచూస్తూ కనిపించాడు.

"నిజంగా నా కిప్పుడు చాలాఆనందంగా ఉంది కవితా! నీతో ఏకాంతంగా మాట్లా డాలని అవకాశం కొరకే ఎదురు చూస్తు న్నాను..." నవ్వుతూ అన్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. గడ్డిలో కూర్చు న్నాను.

అతనూ కూర్చున్నాడు.

"ఇంత అర్జంటుగా పిలిపించావూ..."

"రా మూ... ఆడదాన్ని అన్యాయం చేయడం మంచిది కాదు" అన్నాను కోపంగా

"నేనా! ఎవరిని అన్యాయం చేశాను" అన్నాడు.

"కట్టుకున్న ఆడదాన్ని."

"సునీతకు నేనేం లోటు చూపలేదు. ఆమె కోరినవన్నీ ఇంట్లో ఉంటాయి..."

"ఒక మగని అనురాగం తప్ప..."

"ఓహో ఆవిడగారు నివేదించుకున్నారా తనుతో?"

"అది అందరిలాంటిది కాదు. ఎంత బాధైనా అణచుకుంటుంది... రామూ నువ్వు నాకోసం సునీతను చేసుకున్నావంటు న్నావుగా మరి నా కోసం ప్రేమించలేవా? ఆ సునీతనే కవితనుకోలేవా?" బేలగా అడిగాను.

"పిచ్చి కవితా!" బాధగా నవ్వి అన్నాడు. "ఇది డ్రామా కాదు. మొదటి కృష్ణుడు, రెండో కృష్ణుడు అంతా కృష్ణుడ్లేనసుకోవ టానికి. కాలేజీలో నిన్ను చూసిన మొదటి రోజునుంచే ప్రేమించాను. తిరస్కరించ టమే కాక నీ యిష్టమైన వారితో నా

పెళి జరిపించావు. మన కాలేజీలోనేచదినితే నన్ను పలకరించక తప్పదని కదూ నువ్విక్కడ్నుంచి వెళి పోయావు?''

''రామూ...! నిజంగా నే నా విషయమే ఆలోచించలేదు నా కిక్కడ సీటు దొరక లేదు ''

''తృప్తిపరచేందుకు ఎన్నైనా కలిపించి చెప్పొచ్చులే ''

''నువ్వు నమ్మినా నమ్మకపోయినా నా కొచ్చే నష్టమేమిలేదు

ఇంకొక్కసారి నిన్ను నీ సోదరిలా కోరు తున్నాను సునీత కన్యాయం చేయకు నీలో సగం దానికివ్వు వీారు సు ఖ ం గా పిల్లా పాపలతో ఉండాలని నా కోరిక ప్లీజ్ రామూ మనసుమార్చుకోలేవా! న న్ని క సు ం చి నీ సోదరిగా భావించమంటున్నాను...'' అంటూ ఏడ్చాను.

''కవితా !'' కన్నీరు తుడిచి అన్నాడు.

''రామూ—'' ఆనందంగా అన్నాను

''కానీ ఒక్కటి గుర్తుంచుకో... నువ్వె క్కడున్నా, ఎలాఉన్నా ఈ అన్న ఉన్నాడని, చూడాలని మాత్రం మరువకు కవితా''

''రామూ ...''

''కాదు... అన్నయ్య''

''నాకూ అన్నయ్యలు లేరు. నిన్నైనా పిల్చుకుని నాకూ ఒక అన్న ఉన్నాడను కుంటాను...''

''ఇక ఇంటికెళు, కవితా !''

''నువ్వూ ఇంటికెళ్ళగానే సునీతను చిరు నవ్వుతో పలకరించాలి...''అన్నాను అతనితో నడుస్తూ.

మందహాసం చేస్తూ తన దారిన వెళ్ళి పోయాడు. నేను ఇంటి కొచ్చేశాను. నా మనసెంతో హాయిగా ఉందిప్పుడు. ఇలా ఉండగ సావిత్రి గుర్తు కొచ్చింది. రోజులన్నీ ఇక్కడే గడిచిపోయాయి. అందర్నీ చూసు కున్నాను. అక్కా, బావను తప్ప. చదువు కోవాల్సింది ఉందనిచెప్పి బైలుదేరి సావిత్రి ఊరి కొచ్చాను. అదిచ్చిన విలాసం ప్రకారం ఇల్లు చేరుకున్నాను. తలుపు తట్టగానే ఓ పొడుగాటి యువకుడు వచ్చి తలుపు తీయగా కొంచెం తటపటాయించాను.

''ఎవరండీ ? ఎవరు కావాలి ? రండి'' తలుపులు రెండూ పూర్తిగా తెరుస్తూ అన్నాడు.

''సావిత్రి'' అంటుండగానే అందు కున్నాడు.

''సావిత్రి ఇల్లు ఇదేనండి. మీ రే నా కవితగారూ !''

''ఔనూ ! మీ కె లా తె ల్సు ...'' అనుకుంటూనే ఆశ్చర్యంగా అనేశాను.

''మా సావిత్రి మీ గురించి చెప్పనిరోజు లేదులెండి. మీ రొస్తారన్నారట. రోజూ ఎదురు చూస్తుంది. నేను సావిత్రి అన్నను. రండి'' అంటూ అతను దారి తీస్తుంటే అనుసరించింది.

ఇంతలో సావిత్రి క ని పి ం చే స రి కి 'హమ్మయ్య' అనుకుని గట్టిగా ఊపిరి వదిలాను

''హలో కవితా! రారా! నీకోసం ఎద రు చూస్తూనే ఉన్నాను. కూర్చో'' అంటూ కుర్చీ చూపించింది.

''సెలవులన్నీ అయిపోబోతుంటే ఇప్పు డొచ్చావు. ఇక విన్నాదిలేది లేదు. ఇద్దరం కలిసే కాలేజికెళ్దాం. అందాకా ఇక్కడే.... అమ్మా'' పిలుస్తుండగనే ఆవిడ వచ్చింది.

''అమ్మా కవితని చెప్తూంటానే ఇదే! కవితా మా అమ్మ'' అంటూ పరిచయం చేసింది.

''నమస్తే నండీ...''

''నీ గురించి మా సావిత్రి చెప్తూనే ఉంటుందమ్మా. సావిత్రీ బాత్ రూం చూపించు'' అని వెళ్లిపోయింది.

సావిత్రి బాత్ రూం చూపి తల్లి దగ్గరి కెళ్లింది.

అక్కడ పంపు దగ్గర వాళ్లన్న మొహం కడుక్కుంటున్నాడు. నేను తడబడూ వెన క్కడుగేసి గది బైటే నిల్చాను. అక్కడున్న పూల మొక్కలవంక చూస్తూ నిల్చున్నాను. ''వెళ్లండి'' అన్నాడు లోపలినుంచి వచ్చి. నేను తలొంచుకుని లోపలికెళ్లి వెనక్కి తిరిగి చూశాను. అతను నన్నలాగే చూస్తూ నిలబడి వున్నాడు. నే చూసేసరికి గబగబ వెళ్లిపోయాడు. నేను మొహం కడిగి వచ్చే సరికి భోజనాల ఏర్పాటు కూడా జరిగింది. అక్కడా డైనింగ్ టేబిల్ ముందు ఉన్నా డతను.

''రా భోం చేద్దాం... మా అన్నయ్యేలే రా...'' అంటూ సంశయిస్తున్న నన్ను చెయ్యి పట్టి లాగింది. వాళ్లమ్మ మాకు వడ్డించింది.

''కవితగారూ!!'' నోట్లో ముద్ద పెట్టుకోబోతూ ఉలికిపడ్డాను. అతనివైపు చూశాను.

''మా సావిత్రి ఏమైనా చదువు తుందా?'' అడుగుతూ నావైపు చూసేసరికి నా చూపులు మరల్చుకున్నాను.

''క్లాసులో ఫస్టు మీ చెల్లెలే.''

''ఏయ్, అంతా వట్టిదన్నయ్యా ! మా క్లాసులో ఏ సబ్జెక్టులో ఎవరైనా కవిత పిదపే అన్నయ్యా.''

(35 వ పేజీ చూడండి)





# మాయాజాలం మతికట్టు



## మేజికల్ సస్పెన్షన్

ఇంద్రజాల ప్రదర్శనల విషయంలో కొన్ని కొన్ని సందర్భాలలో అనుకోకుండా ప్రదర్శన యివ్వవలసిన పరిస్థితి ఎదురైనప్పుడు, ఎదుర్కొని ప్రదర్శించ గలిగే, చాకచక్యం కూడా ఇంద్రజాలికుడికి ఎంతైనా అవసరం.

మన దేశంలో ఎన్నో సుందరమైన నగరాలున్నాయి. ఢిల్లీ, కలకత్తా, ఆగ్రా, బొంబాయి, మద్రాసు, బెంగుళూరు, హైదరాబాదు వగైరా... వగైరా... ప్రతి నగరంలోనూ, కొన్ని వింతలు, ప్రత్యేకతలు వుండడం విశేషం.

అట్లాంటి వింతలు విశేషాలున్న నగరాలలో ముఖ్యంగా మద్రాసు నగరం ఒకటి. మద్రాసు నగరానికి ఎనిమిది బీచ్ (సముద్రపుటొడ్డులు)లు వుండడం మరీ విశేషం. అవి యిలియర్డ్సు బీచ్, ఎవర్సు బీచ్, మెరీనా బీచ్ వగైరా... వగైరా..., వీటన్నిటిలోనూ అతి సుందరమైనది మెరీనా బీచ్.

రోజంతా అనేక కార్యకలాపాలలో మునిగిన ప్రజలు, కొంచెం సేపయినా బరువు బాధ్యతలను మరిచి పోడానికి, ఒక్కళ్లేమి, అన్ని రకాల వాళ్లూ సాయంత్రం అయ్యేసరికి యీ మెరీనా బీచ్ చేరుకుంటారు.

ఆరోజు సెలవు దినం కావటం వల్ల మద్రాసు మెరీనా బీచ్ చాలా సందడిగా వుంది. ఒక ప్రక్క కష్టించి పనిచేసిన కార్మికులు, ఉద్యోగస్తులు, వేరొకవైపు స్త్రీ, పురుషుల జంటలు, ఇక ఎక్కడపడితే అక్కడ నెత్తిమీద యిసుక జల్లుకునే ఆట ఆడుకుంటున్న పిల్లల గుంపులు. ఐస్‌క్రీం కేండీలు. పల్లీలూ, కాలక్షేపం బఠాణీలు, మిర్చీ బజ్జీలు అమ్మేవాళ్ల సంగతి సరేసరి.

ఆ రోజే నేనూ పదిమంది స్నేహితులం కలిసి మెరీనా బీచ్‌కి పిక్‌నిక్‌కి వెళ్లాము కాసేపు ఒక ప్రక్క గుంపుగాచేరి కూర్చుని స్నాకు అయ్యేవరకూ జోక్సు వేసుకుంటూ కాలక్షేపంచేసి, తర్వాత అంతాకలిసి సముద్ర స్నానం చేద్దామని ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నాము.

మాలో యీత రానివాడ్ని మాసామాన్లు చూస్తుండమని కాపలా పెట్టి ఒకళ్ల తర్వాత ఒకళ్లం సముద్రంలోకి దూకడం మొదలెట్టాము. నేను కూడా ఒక తువ్వాలు చుట్టుకుని దూకాను.

ఆరోజు సముద్రం పడిలేచే కెరటాలతో నిండివుండడంతో ఎంతో ఆహ్లాదంగా తోచి మా కెవరికి సముద్రం వదిలి రావాలనిపించలేదు.

అట్లా మేమంతా దాదాపు రెండుగంటలసేపు మా జలక్రీడలు కానిచ్చి ఒళ్ళు,తలలు శుభ్రంగా తుడుచుకుని పొడి బట్టలు కట్టుకుని, అంతా వలయంగా కూర్చుని మేము తెచ్చుకున్న చిరుతిళ్లు తింటూ కబుర్లలోకి దిగాము.

అట్లా మాకబుర్లు వో గంటసేపుసాగిన తర్వాత వున్నట్టుండి స్నేహితుడు ప్రసాద్ నన్నుమింగేసేలా చూస్తూ, ''ఏయ్ కామేష్ మా కిప్పుడు ఏదోఒక మాజిక్‌చేసి చూపెట్టాలి గురూ !'' అన్నాడు.

వెంటనే అంతా ''అవును స్మిజా ఒక మాజిక్ చెయ్యిగురూ !'' అరిచారు.



ఐతే చూడండి శిష్యులారా! నేను తప్పకుండా ఒక మాజిక్ చూపిస్తాను. కాని ఒక్కషరతు !?

మీకు నిజంగా నామీద గురుభావంవుంటే మీరు నాకు ముందుగా తలో అర్ధరూపాయి గురుదక్షిణ చెల్లించుకోండన్నాను. అందరూ 'మాజిక్' వేడిమీదున్నారేమో సరే అట్లాగే చెల్లిస్తామన్నారు.

యింతలో నేను ఆలోచించసాగాను. వెంటనే నాకొక ఐడియా తట్టింది !?

ఎవరి అర్ధరూపాయికాసులు వాళ్ళచేత్తో పట్టుకోమని చెప్పి నేను స్నానంచేసి ఆరేసిన పొడితువ్వాలు తీసుకువచ్చి దాంట్లోంచి కొన్ని దారపు పోగులను తీసి అందరికి తలొక దారం యిచ్చి ఒక కొనకు అర్ధరూపాయి కాసుని కట్టి రెండవ కొసని పట్టుకోమని చెప్పాను

తర్వాత మిత్రులారా ! మీ కళ్లముందే మీరు చూస్తూండగా మీ అర్ధరూపాయలు వ్రేళ్లాడ దీసిన దారాలను అంటిస్తాను. దారం తెగి నాణెం క్రింద పడిందంటే నేను ఐదుర్పాయలు మీ కిస్తాను లేదా మీరే నాకు ఒక రూపాయి యివ్వాలని పందెంవేసి, అగ్గిపుల్ల గీసి అన్ని దారాలను వరుసగా వెలిగించాను.

అంతే ! ఇంకేముంది !! ఆశ్చర్యం !!!

అన్ని దారాలు చిరచిర లాడుతూ మండిపోయి ఏ ఒక్క దారం కూడా తెగక నాణాలు పడిపోకుండడంచూసి మిత్రులంతా నోరెళ్ళబెట్టుకుని చూస్తూ వుండిపోయారు.

ఆ మరుక్షణం మిత్రులంతా కిక్కురుమనకుండా తలో రూపాయి నాకుసమర్పించుకున్నారు. స్నేహితుడు ప్రసాద్ మాత్రం 'గురూ' అన్నందుకు రూపాయిస్పంగొడిదిందని గొణుక్కున్నాడు.

ఆ రోజు నేను లేచినవేళ మంచిది కాబట్టి, నాతోబాటు నన్ను చుట్టబెట్టుకుని దాదాపు రెండుగంటలసేపు సముద్రపు ఉప్పు నీళ్లలో నానిన తువ్వాల్లోంచి తీసిన దారాలవల్లనే అంత ఘనకార్యం చెయ్యగలిగానని వాళ్ళెవరికీ తెలీదు. తెలిసుంటే మిత్రులంతా అమాంతం నన్ను మోసుకెళ్ళి ఓ నాలుగు నిముషాలు నానబెట్టుండేవాళ్లేమో!

— భావరాజు కామేష్.

# రాగమాలిక

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

**15**

(గత సంచిక తరువాయి)

అన్నయ్య పేరు వుంది పైన. అన్నయ్యకి రాశారు. అన్నయ్యకి ఇక్కడికెందుకు రాశారు?

నేను కూడా చదవాలనా ? బహుశా అంతే అయివుంటుంది. అయితే ఉత్తరం చింపరా ? నేను చదవాలని రాసినప్పుడు చింపడానికేం ? చింపాను. నేను చదవాలని అన్నయ్య పేర ఇక్కడికి రాశారు. కానీ నాకు రాయలేదు.

అంత ఎక్కువయిపోయానా నేను ? కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

''మైడియర్ రాజా !

మీరంతా క్షేమమనుకుంటాను. ఇక్కడ నేను క్షేమమే.

చి. మంజుల ఆరోగ్యంగా వుందా ? ఆరోజు మంజును చూడలేకపోయాను నేను మంజుకు అన్యాయమే చేశాను. దాన్ని సరిదిద్దుకుందామన్నా— అవకాశంలేకుండా పోతోంది

చి. మధు, సుధలను వాళ్లమ్మ దగ్గిరే గడిపెయ్యమను సెలవులీసారి తిరుపతి నుంచి కూడా ఇక్కడికి తీసుకురావద్దు మధుని.

ఎందుకంటే — 'ఆనీ'కి వంట్లో అంత బావుండడంలేదు. తరచు జ్వరం, దగ్గు వస్తున్నాయి. డాక్టరుకి చూపిస్తే — టి. బి. ప్రారంభదశలో వున్నదని చెప్పారు. ఆస్పత్రిలో చేర్పించాలని అనుకుంటున్నాను. ఇట్లాంటప్పుడు పిల్లలు ఇక్కడుండడం అంత మంచిదికాదేమో ! నేను హాస్పిటల్‌కి తిరుగుతూవుండాలికదా ?

భగవంతుడున్నాడని యిప్పుడు గాఢంగా నమ్ముతున్నాను నేను మంజుకి చేసిన అన్యాయానికి ఫలితం యిప్పుడు అనుభవిస్తున్నాను. ఉంటాను రాజా ! చి మంజుకి, చిరంజీవులకి నా ఆశీస్సులు. బాబుకి, సుశీలకి కూడా ఆశీస్సు లందిస్తావుగా ? అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూవుంటావుగా ?

— నీ మాధవ్.''

నా హృదయం కరిగిపోయింది.

ఆ ఉత్తరంలో మూడువంతులు నా సంగతే వుంది. అంటే ... అంటే ఆయనకి నేనంటే యింకా ప్రేమ ఏ మూలో వుందన్నమాట !

జరిగినదానికి నిజంగా పశ్చాత్తాప పడుతున్నారా ?

అవును సుఖంగా ఆవిడతో కలిసివున్నన్నాళ్లూ ఈ మంజుల యెక్కడుందోకూడా అక్కరలేకుండా పోయింది.

ఆవిడకి పిల్లయిలేరు కాబట్టి ఈయనకి మధు సుధ కావలసివచ్చారు. వాళ్లనిబట్టే నేను !

అవసరాన్నిబట్టి మారే మనుషులు—నిలకడగా వుండగలరా? వాళ్ల అభిప్రాయాలు నమ్మదగ్గవేనా? ఆవిడకి వంట్లో బాగాలేకపోతే ఈయన సేవలు చెయ్యాలి. అది తల్చుకుంటేనే నా గుండె ఈర్ష్యతో భగ్గుమంటోంది.

ఈ ఎనిమిదేళ్లలో నేను ఎన్నిసార్లు జబ్బుపడలేదు ? ఎన్ని బాధలు పడలేదు ? ఎవరు చేశారు నాకు సపర్యలు ? ఆయనకేమన్నా పట్టిందా ? అసలు తెలుసా ? మొండిప్రాణాన్ని కాబట్టి - ఇంకా బతికున్నాను.

పిచ్చిదాన్ని ! వట్టి పిచ్చిదాన్ని !!

ఉత్తరంలో రెండుసార్లు నా పేరు రాయంగానే నామీద ఎంత ప్రేమ అని పొంగిపోతు న్నాను. నిజంగా అంత ప్రేమే వుంటే నన్ను వెతుక్కుంటూ నాదగ్గిరికి రాలేకపోయారా ?

భ్రమ ! అంతా భ్రమ !!

నాపేరన ఒక్క ఉత్తరముక్క అయినా రాయలేని ఆయనకి నామీద ప్రేమా ? అయ్యో రాను !!

నామీద నిజమైన ప్రేమ వుంటే అసలిట్లా చేసేవారా ? పిల్లలకోసమని మెత్తబడుతున్న నా మనసు తిరిగి కఠినమైపోయింది.

ఆ ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపిపారేద్దామన్నంత ఆవేశం వచ్చింది. కానీ తమాయించుకున్నాను.

అది అన్నయ్యకి రాసింది నాకు కాదు.

రాబోతున్న కన్నీటిని బలవంతాన నిగ్రహించు కున్నాను.

మనశ్శాంతికోసం భగవద్గీత తెరిచాను.

శ్లో. మయ్యావేశ్య మనోయేమాం
నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే
మే యుక్తతమా మతాః

మళ్లీ మళ్లీ చదివాను.

ఆ 'పార్థసారధిని' తల్చుకుంటూ కళ్లు మూసుకున్నాను.

అన్నయ్య వచ్చేశాడు ఢిల్లీనించి అమ్మయ్య ! సమయానికి వచ్చాడు. పిల్లలొచ్చేది ఇవాళే.

నా మనసు చాలా ఉత్సాహంగా వుంది.

ఇద్దరూ కలిసిరావడం ఇదే మొదటిసారి.

ఇద్దరికీ ఇష్టమైనవి తయారు చేయించాను. ఇద్దరి రూములూ సర్ది అలంకరించాను. అందంగా వుంచాను.

ఒకచోట కాలు నిలవడంలేదు.

ఒకదానిమీద మనసు నిలవడంలేదు.

ఉండి వుండి ఉలిక్కిపడుతున్నాను. సుధ ఉత్తరంలో రాసిన ప్రశ్నలు నన్ను నిలదీసివేస్తే నేనేం జవాబు చెప్పాలి ? ఎట్లా చెప్పాలి ? ఆలోచిస్తున్న నేను పిల్లలు ఎప్పుడు వచ్చిందీ గమనించనేలేదు

ఎవరో నా కళ్లు మూశారు.

చేతులు తడిమిచూస్తుండగా కిలకిలా నవ్వు ! మధు తన చిన్నారి చేతులతో నా కళ్లు మూశాడు.

సుధ ముత్యాలు రాలినట్లు నవ్వుతోంది.

ఒకేసారి ఇద్దర్నీ గాఢంగా నా గుండెలకు హత్తుకున్నాను.

కన్నీళ్లు జలజలా రాలాయి.

సుధ తను కూడా కన్నీళ్లు పెట్టుకుంది.

మధు నా బుగ్గలమీదగా జారుతున్న కన్నీటిని తుడిచాడు.

''అమ్మా ! చాలా చిక్కిపోయినావమ్మా !

---

**జరిగిన కథ -** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు. కానీ అందులోనూ అసంతృప్తే. కొడుకు వస్తే కూతురో, కూతురువస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రిదగ్గర కెళ్లిపోతారు. ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు. చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపడ్తాడు మంజులని. రామం భార్య రాధ. బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గిరికి వస్తాడు రాజు. మధు అనారోగ్యం మంజులని మరింతగా కృంగదీస్తుంది. రామంతో పెళ్లి కాకముందు తనకోసారి పెళ్లయిందని రాధ నోట విని ఆశ్చర్య పోతుంది మంజుల. రాధ సంగతంతా తెలిసే పెళ్లి చేసుకున్నానుగానీ ఆనె కోసారి పెళ్లయిందనే విషయం నన్నామెపట్ల రాక్షసుడిలా ప్రవర్తించేలా చేసేది ... అని మంజులతో చెప్తాడు రామం తన కడుపులో బిడ్డకి తాను తండ్రి కాదన్న రామం మాటలకి మానసికంగా దెబ్బతిన్న రాధ మృత శిశువుని ప్రసవిస్తుంది. నువ్వూ, నాన్న కలిస్తే చాలా బావుంటుందమ్మా అంటూ ఉత్తరం రాస్తుంది సుధ మంజులకి. తన వద్దకు రావటానికి నిరాకరించిన రాధని మంజుల వద్ద కొన్నాళ్లుండనివ్వమని మంజులను కోర్తాడు రామం.

ఎందుకమ్మా ఇట్లా వున్నావు? నీ ఒంట్లో బావుంటోందా ?''

సుధ అడిగింది.

''ఆఁ! నాకేమమ్మా? బానే వున్నాను.' అన్నాను సుధ ఆప్యాయతకి కరిగిపోతూ !

''మీ యిద్దరికీ ఒక దారి చూపేదాకా నేను బతికేవుంటానమ్మా ! బతికేవుండాలి !''

లోపల అనుకోబోయి పైకే అనేశాను.

మధు, సుధ వింతగా చూశారు.

సుధ ఏదో అనబోయింది.

అంతలో అన్నయ్య వచ్చాడు.

''మంజూ ! నీకు రానురానూ మతిపోతోందే! పిల్లలతో అట్లాగేనా మాట్లాడడం ?''

అన్నాడు నన్ను మందలిస్తూ.

నేను నా తప్పు తెలుసుకున్నాను. తల వంచుకున్నాను.

''మధూ ! సుధా ! తొందరగా స్నానంచేసి రండి ! నాకు ఆకలేస్తోంది. ఇవాళ సాయంత్రం పిక్చర్ ప్రోగ్రాం !''

పిల్లలిద్దరూ లోపలకెళ్ళారు. నేనూ వాళ్ల వెనకాలే నడిచాను.

మధుకి నీళ్లుపోసి, తుడిచి గుడ్డలు వేశాను. వెర్రినాయన ! ఇంకా వళ్లు చెయ్యనేలేదు. సన్నగానే వున్నాడు.

పౌడరువేసి తలదువ్వాను.

అంతలో సుధ షాంపూతో తలరుద్దుకుని వచ్చేసింది. బాబ్డ్ హెయిర్ కాదిప్పుడు సుధకి.

పొడుగ్గా నల్లగా పట్టుకుచ్చులా వుంది జుట్టు.

''ఏమిటే షాంపూతో రుద్దుకున్నావు ? నేను పోసేదాన్నిగా! కుంకుడుకాయలతో తలంటి?''

అన్నాను దాని జుట్టు తడి తుడుస్తూ.

''అలవాటయిపోయిందమ్మా ! షాంపూతో పోసుకోవడం. వచ్చేవారం నీచేత పోయించుంటాలే !''

వయసు వస్తోంది సుధకి.

అందాల రాశిలాగా వుంది నా సుధ !

మధుర పరికిణీ, దానికి మాచయిన జాకెట్టూ వేసుకుంది. విరబోసుకున్న జుట్టు ఎగిరెగిరి పడుతోంది ఫాను గాలికి. కాటుక కళ్లు విశాలంగా వున్నాయి. నవ్వినప్పుడు అచ్చం తండ్రే అది.

నా దిష్టే తగిలేలా వుంది !

అందరం కలసి భోంచేశాము నాకు ఆనందంతో అన్నం సయించలేదు.

భోజనాలయినాక అందరం కలిసి కబుర్లు చెప్పకున్నాం చాలా సేపు.

అన్నయ్య ఢిల్లీ నుంచి పిల్లలకి చాలా ప్రెజెంట్స్ తెచ్చాడు. అవన్నీ చూసి పిల్లలు చాలా సంబరపడ్డారు.

నాకు ఖాదీ సిల్కుచీర తెచ్చాడు

వదినకి కూడా అట్లాంటిదే తెచ్చాడు.

అన్నయ్యకి నేనంటే ఎంత ప్రేమ !

అన్నయ్య, వదినల వల్లనే నేనింకా జీవించి వున్నాను ఈమాత్రంగా !

ఏవో కబుర్లు చెప్తూనేవున్నారు పిల్లలు. నాకు కునుకుపట్టేసింది.



దాదాపు గంటసేపు నిద్రపోయాను అట్లా !

తరవాత లేచేటప్పటికి — అన్నయ్య దగ్గిర పడుకుని నిద్రపోతున్నాడు మధు. అన్నయ్య కూడా గాఢనిద్రలో వున్నాడు.

సుధ నిద్రపోలేదు నేను పడుకున్న మంచానికి దగ్గిరగా ఒక కుర్చీలో కూచుని ఏదో ఆలోచిస్తోంది

దాని చేతిలో అదేమిటి ?

ఉలిక్కిపడ్డాను !

గుండె దడదడ లాడింది !

అది వాళ్ల నాన్న రాసిన ఉత్తరం ! అన్నయ్య కిద్దామని మర్చిపోయాను ఆ బల్లమీదే వుండి కాబోలు. ఛీ—ఛీ!

నా మతిమరుపుకి నన్ను నేనే తిట్టుకున్నాను

ఇప్పుడేమనుకునీ ఏం లాభం ? చదివేసిందది ! దానికి ఇతరుల ఉత్తరాలు చదివే అలవాటు లేదే అయినా అది తన తండ్రి రాసిందేగా ? అందుకనే చదివిందేమో ! ఏమైనా దాని ముఖంలోకి చూడాలంటే చిత్రమైన భయం పట్టుకుంది నాకు

అందుకనే నిద్ర లేచినా — లేవనట్లే నటించాను

సుధ నన్నసలు గమనించే స్థితిలో లేదు

ఈ సుధ నేను కన్న పిల్లేనా ? నా చేతిలో పెరిగిన పిల్లేనా ? నా ఒళ్లో అల్లరి చేసిన పిల్లేనా? ఎంత పెద్దదైపోయింది ? మానసికంగా ఎంత ఎదిగిపోయింది ? కాసేపటికి ఉత్తరం మడిచి బల్లమీద పెట్టింది. లేచివచ్చి నా దగ్గిర పడుకుంది.

కళ్లార్పకుండా నా ముఖంవంకే చూస్తూ వుంది చాలాసేపు

అది గమనించాను నేను

కానీ కదల్లేదు — నేను.

అట్లా చూస్తూవున్న సుధ విశాలమైన కళ్లల్లో నీరు గిర్రున తిరిగింది.

దాని మనసులో తిరుగుతున్న భావాలేమిటో ?

నేనింక నటించలేకపోయాను

దుఃఖం పొంగివచ్చింది నాక్కూడా.

దాన్ని గట్టిగా హృదయానికి హత్తుకున్నాను.

ఇద్దరం ఎంతోసేపు అట్లాగే వుండిపోయాము.

* * *

ఒకవారం పది రోజులు పిల్లల ఆటపాటలలో గడిచిపోయాయి.

తరవాత వారానికి తిరుపతి ప్రయాణం పెట్టుకున్నాం.

అన్నయ్య వచ్చాడు.

''పిల్లల్ని నాతో తీసికెళ్తానే మంజా - మీ వదిన తీసుకురమ్మంది ఒక వారం వుండి వస్తారు. తిరుపతి ప్రయాణం టైముకి దించుతాను వాళ్లని సరేనా ?'' అన్నాడు.

''నన్ను రమ్మనలేదా – వదిన ?'' నవ్వుతూ అన్నాను.

''నువ్వు రాకుండానా ? నువ్వు వస్తే మా కంతకంటే ఇంకేం కావాలి ? కానీ, రాధ వస్తుందని అంటున్నావుగా ? అందుకనే నిన్నీసారి బలవంతం చెయ్యడంలేదు.'' అన్నాడు అన్నయ్య తనూ నవ్వుతూ.

''సరేరా అన్నయ్యా వూరికే అన్నాను మీ మనసు నాకు తెలీదూ ? సుధా — మధూ ప్రయాణానికి సిద్ధంకండి ! అన్నయ్యా ఒక్క మాట ! తిరుపతి నువ్వు, వదినా బాబూ కూడా వస్తే బావుంటుందిరా - సరదాగా వెళ్లి రావచ్చు!''

'సరే మీ వదిన్నడిగి చెప్తా—' అన్నాడు అన్నయ్య.

మధు ప్రయాణమంటే ఉత్సాహపడ్డాడు.

కానీ సుధ అంత సుముఖంగా వున్నట్టు లేదు.

''నేను వెళ్లనమ్మా !'' అంది.

''ఏమే సుధా ! ఎందుకు రావూ ? పిలుపు చాల్లేదా ?''

అన్నయ్య నవ్వుతూ అన్నాడు.

''కాదు మామయ్యా ! అమ్మ ఒక్కత్తే వుండాలికదా ? అందుకని ! మేము స్కూల్లో వున్నప్పుడు ఎట్లాగూ ఒంటరిగా వుండక తప్పదు. ఇప్పుడుకూడా ఎందుకనీ—''

సుధ సమాధానానికి అన్నయ్య కూడా ఆశ్చర్య పోయాడు. సుధ ప్రతి మాటలోనూ యెంతో ఎదుగుదల కనిపిస్తోంది.

అసలీసారి సుధలో చాలా మార్పు కనబడుతోంది. ఒక్క ఏడాదిలో మానసికంగా యెంతో పెరిగిపోయింది సుధ !

ఎక్కువగా మాట్లాడడంలేదు.

ప్రతిదానికీ పరిశీలనగా చూస్తోంది.

ప్రతి విషయాన్నీ విమర్శనాత్మకంగా ఆలోచిస్తోంది. ఆ వయసులోనే వచ్చిన దాని హుందాతనానికి నాకు బాధ, సంతోషమూ రెండూ కలిగినాయి. మా ఇంటి పరిస్థితులేగదా దానికీ హుందాతనాన్ని నేర్పాయి — అని నా బాధ !

ఎప్పటికయినా ఆడపిల్లకది ఆభరణమే— అది ఎవ్వరూ నేర్పకుండానే దానికి పట్టుబడిందనే సంతోషమూ కలిగాయి !

అన్నయ్య ఎక్కువగా దాన్ని బలవంతం చెయ్యలేదు.

నాలుగయిదు రోజుల్లో తీసుకువస్తానంటూ మధుని మాత్రం వెంటబెట్టుకు వెళ్లాడు.

వదిన్ని తిరుపతి ప్రయాణం విషయం అడగమని మరోసారి చెప్పాను అన్నయ్యకి.

నేనూ, సుధా, భాగ్యమ్మగారూ మిగిలాం.

భాగ్యమ్మగారు కూడా సుధని యెంతగానో మెచ్చుకుంది.

సుధ నాకూడా కూడా తిరుగుతూ ఎంతో పని చేస్తోంది. ఇల్లంతా నీటుగా సర్ది పెడుతోంది. ఇప్పుడది నా కూతురుగాలేదు. నా స్నేహితురాలిగా - ఆత్మీయురాలిగా వుంది. ఎన్నో విషయాల్లో నాకు సహాయంగా వుంటోంది. సలహాలుకూడా ఇస్తోంది.

రాత్రి భోజనాలయ్యాయి.

ఆరాత్రి నా పక్కనే పడుకుంది సుధ.

రోజూ మధు పడుకుండేవాడు.

సుధని ఎప్పుడూ పడుకోనిచ్చేవాడేకాదు. పోట్లాడేవాడు దానితో.

అల్లరివెధవ ! నవ్వుకున్నాను.

సుధ ఏదో నాతో మాట్లాడాలని తెగ ఆరాటపడుతోంది.

మళ్లీ సంశయిస్తోంది.

నేను గ్రహించానది.

అది ఏం మాట్లాడబోతోందో తెలిసిన నా మనసు అదిరిపడుతోంది.

బయటికేమీ కనబడనీయలేను నేను.

తదేకంగా బెడ్ లైట్ వైపే చూస్తూ పడుకున్నాను.

కొంతసేపయ్యాక —

''అమ్మా !'' మెల్లగా పిలిచింది.

''ఏమ్మా ?'' అడిగాను తలతిప్పకుండానే.

''నేను కొన్ని విషయాలు అడుగుతాను చెప్తావామ్మా ?''

''ఏమిటమ్మా అవి ?'' మెల్లిగా తలతిప్పి చూశాను.

సుధ లేచి కూచుంది.

ఏదో దృఢనిశ్చయం కనబడుతోంది దాని మొహంలో.

''నువ్వు ఎన్నాళ్లనించి ఇట్లా వంటరిగా వున్నావమ్మా ?''

''అంటే ?''

''అంటే ... నాన్నగారు ... నాన్నగారు మళ్లీ పెళ్లి చేసుకుని ఎంతకాలమయింది ?''

''ఎందుకమ్మా నీకవన్నీ ?''

''చెప్పమ్మా — ఊరికే తెలుసుకుందామని !''

''ఎనిమిదేళ్లయింది.'' పొడిగా అన్నాను.

''ఈ ఎనిమిదేళ్లనించీ నువ్వు మాకోసమే ఇట్లా వంటరి జీవితాన్ని గడుపుతున్నావుగదూ?''

నేనేం మాట్లాడలేదు. నా మనసంతా అల్లకల్లోలంగా వుంది. ప్రళయం...ప్రళయం... ఉప్పెన ... ఉప్పెన ...

నా చెవులు హోరుమంటున్నాయి !

''నాన్నగారు చాలా చెడ్డవారు — కదమ్మా ! యింత మంచి అమ్మని ఇట్లా కష్టపెట్టడం... తప్పుకదూ ?''

''.........''

''అసలా 'ఆంటీ' ఏం బావుండదమ్మా ! ... మంచిదికాదు... !''

''సుధా — నాకు నిద్ర వస్తోందమ్మా !'' అన్నాను నన్ను నేను సంభాళించుకుంటూ !

సుధ నా మాటే వినిపించుకోనట్టు —

''నీకు కనీసం ఉత్తరాలు కూడా రాయరెందుకమ్మా నాన్న ?''

''... ... ... ...''

''నీమీదెందుకమ్మా నాన్నకి కోపం ?''

''... ... ... ...''

''అసలేం జరిగింది? నువ్వేం చేశావు ?''

''... ... ... ...''

''తప్పెవరిదసలు ఇందులో ?''

''అబ్బా — సుధా — నన్నెందుకమ్మా బాధ పెడతావు ?''

ఆ విషయం తల్చుకుంటేనే నా మనసు ముక్కలయిపోతుందనీ — ప్రతి క్షణం చచ్చిపోదామనిపిస్తుందనీ - సుధకి తెలీదు. తెలిస్తే నన్నిట్లా చిత్రవధ చెయ్యదు.

భర్త పరాయి ఆడదాన్ని గురించి ఆలోచిస్తేనే సహించలేదు స్త్రీ ! పురాణయుగాల్లో ఏమోగానీ— యిప్పటి సంగతిది.

అట్లాంటిది — అట్లాంటిది — ఇది మరీ ఘోరం కదూ ?

నన్నూ — నా వ్యక్తిత్వాన్నీ — నా అందాన్నీ — ఆఖరికి పిల్లలని కూడా లెక్కచెయ్యక...

ఓహ్... నేనింక ఆలోచించలేను.

''కాదమ్మా, నాన్న రాసిన ఉత్తరం చూస్తే... ఏం — నీకు రాయగూడదూ ?''

నాకు కోపం — ఆవేశం — ఆవేదన — దుఃఖం ముంచుకొచ్చాయి.

''సుధా ! నీకు నేనింకా కొన్నాళ్లు బతికుండాలనివుంటే దయచేసి ఆ ప్రసక్తి ఆపెయ్యి ... మొండిగా — మోడుగా బ్రతుకుతున్న ఈ అశాంతి బ్రతుకు గతాన్ని తవ్వుకోడానికి కాదమ్మా ! భవిష్యత్తులో జీవించడానికి ... మీ ఇద్దరి భవిష్యత్తూ బంగారుబాట చెయ్యడానికి !''

''మా భవిష్యత్తు బంగారుబాట యెట్లా అవుతుంది ? అమ్మొకచోట — నాన్నొకచోట

---

మీకొవల్సింది మా వారే కదూ! లోపలికి రండి! గదిలో మంచం క్రింద దాక్కుని వున్నారు!!!



వుంటే ... ఈ జన్మలో కాదు...'' అనలేదు సుధ. నా మనసే అంది.

''అమ్మా ... నిన్నిట్లా చూస్తుంటే ... కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని - మా కోసమే బతుకుతున్న నిన్ను చూస్తుంటే – నాకు చాలా బాధగా వుంటుందమ్మా! ఏదో చెయ్యాలనీ ... నిన్ను సుఖపెట్టాలనీ వుంటుందమ్మా! కానీ, ఏం చెయ్యలేకపోతున్నాము. కాదు – చెయ్యడానికి నువ్వే అవకాశం ఇవ్వడంలేదు.''

''నా తల్లీ! సుధా! ఇంక నాకేం అక్కర లేదు. భగవంతుడు నాకు ఈమాత్రం అదృష్టాన్ని ప్రసాదించాడు. అంతే చాలు – అంతే చాలు తల్లీ! నా పిల్లలు రూపాల్లోనేగాదు – గుణాల్లో కూడా రత్నాలు.''

సుధని గట్టిగా కౌగిలించుకున్నాను.



---

గుండెల కదుముకున్నాను.

కన్నీళ్లు అవిరామంగా కారుతున్నాయి ఇద్దరికీ.

ఇంతలో తలుపు చప్పుడయింది.

"నువ్వు పడుకోమ్మా! నేను చూస్తాను." అని సుధ లేచి వెళ్లింది తలుపు తియ్యడానికి.

"మంజుల వుందా ఇంట్లో?" రామం గొంతది.

"నువ్వు?"

"నేను సుధని. మంజుల మా అమ్మ. రండి లోపలికి —" అంటోంది సుధ

రామం — రాధలు నా పిల్లన్నింకా చూడలేదు. ఇదే మొదలు!

"నువ్వు మంజక్క కూతురివా?" రాధ గొంతు —

"అబ్బ — బంగారు బొమ్మలాగా వున్నావు! అక్కయ్య ఎంత అదృష్టవంతురాలు!"

గబగబా అంటోంది రాధ.

నేను కళ్లు తుడుచుకుని—జుట్టు సరిజేసుకుని వచ్చాను హాల్లోకి.

అప్పటికే రామం — రాధ సోఫాల్లో కూచుని వున్నారు.

రాధ సామాన్లన్నీ తెచ్చుకుంది. అంటే రాధ అభిప్రాయం మారలేదన్న మాట!

"అక్కా!" రాధ నన్ను కౌగిలించుకుంది.

"ఏమ్మా రాధా — బావున్నావా?" తల నిమురుతూ అడిగాను.

సమాధానంగా జాలిగా ఏడ్చింది.

నాకూ కన్నీళ్లు వచ్చాయి.

ఎన్ని విధాలుగానో కష్టాలు పడ్డది రాధ. అన్ని విధాలా జీవితంలో ఓడిపోయింది. ఆఖరికి పుట్టిన బిడ్డని కూడా దూరం చేశాడా దేవుడు!

ఇంకనయినా సుఖపడుతుందేమో! రామానికి రాధ మీద వున్న ప్రేమే ఆమె జీవితంలో వెలుగు నింపాలి!

పిచ్చిదాన్ని!

అదొక్కటే చాలదూ? జీవితాన్ని ప్రకాశవంతం చెయ్యడానికి?

అది లేకేగదా నేను అల్లాడుతున్నాను.

రాధతో పోల్చుకుంటే నేనే దౌర్భాగ్యురాల్ని!

రాధ జీవితం ఎన్నెన్నో మలుపులు తిరిగి — యిప్పుడు అసలైన గమ్యం చేరుకుంటోంది.

నా జీవితం ఒకే ఒక్క మలుపు తిరిగింది. పెద్ద అగాధంలోకి తోయబడ్డాను నేను. నా గమ్యం ఏమిటో — ఎప్పుడు చేరుకుంటానో కూడా తెలీదు నాకు!

కొంతసేపయ్యాక ఇద్దరం తెప్పరిల్లాము. చాలాసేపటినించీ ఏడవడంవల్లనో ఏమో నాకు తలనొప్పి మొదలయింది

రాధా — నేనూ — పక్కపక్కన కూర్చున్నాం. సుధని రాధ ఒళ్లోనే కూచోబెట్టుకుంది. మాటిమాటికీ ముద్దుపెట్టుకుంటోంది దాన్ని! పన్నెండేళ్ల సుధ పసిపిల్లలాగా వున్నట్టుంది రాధ కళ్లకి!

రాధ మాతృ హృదయాన్ని అర్థం చేసుకోగలిగాను. స్త్రీ మాతృమూర్తి గాక మునుపు పిల్లలని ఒక దృష్టితో చూస్తుంది.

మాతృమూర్తి అయ్యాక ఏ పిల్లలయినా సరే — ఆమెకి ఆమె బిడ్డలుగానే కనిపిస్తారు. తల్లి బిడ్డని చూసేరీతిలోనే చూస్తుంది — పిల్లలందర్నీకూడా!

అందులో రాధ బిడ్డని కోల్పోయిన మాతృమూర్తి!

"అక్కా — సుధ ఎంత ముద్దుగా వుందక్కా! నువ్వెంత అదృష్టవంతురాలివి! బాబేడీ?... వాణ్నికూడా చూడాలనుంది అక్కా!"

"వాడు అన్నయ్యగారి ఊరెళ్లాడమ్మా! వస్తాడు నాలుగైదు రోజుల్లో! ఇవాళే వెళ్లాడు!"

"మీ భోజనాలయినాయా?" అడిగాను.

"ఆఁ ఆఁ! చేసేవచ్చాం. సాయంత్రమే వచ్చింది రాధ. నేను స్టేషనుకు వెళ్లి యింటికి తీసికెళ్లాను. రానని ఒకటే మొండిపట్టు! అతిబలవంతంమీద భోజనం చేసింది. అక్కడ పడుకోడానికి మాత్రం ఒప్పుకోలేదు. ఎంత బతిమాలినా వినందే! అమ్మ కూడా చెప్పింది. ఉహూఁ! నాతో పోట్లాడి ఒక్కత్తే బయల్దేరింది మీ ఇంటికి. తప్పక నేనూ వచ్చాను. ఏంచెయ్యను మరి?" రామం చెప్పకుపోయాడు.

రాధేమీ మాట్లాడలేదు.

సుధనే కన్నార్పకుండా చూస్తూ — దాని ఒళ్లంతా నిమురుతూ కూచుంది.

నేనేదో నెపంమీద పక్క గదిలోకి వెళ్లి రామాన్ని పిలిచాను.

"చూడు రామం! ఇప్పుడేమీ ఆమెకి ఎదురుగా చెప్పకు. కొన్నాళ్లు ఇక్కడే వుండనీ! కాస్త ఆమెకి మనసు కుదుటపడ్డాక నచ్చచెప్పొచ్చు. ఇక్కడ పిల్లల ఆటపాటలతో బాధలు — గతం కాస్త మర్చిపోవచ్చు. గాయం మానినాక ఏ విషయమైనా ఆలోచిద్దాం. వచ్చేవారం మేము తిరుపతి వెళ్లాలనుకుంటున్నాం. నువ్వు రావద్దు. రాధని మాతో తీసికెళ్తాను. ఏది ఏమయినా నీ కాపురం చక్కదిద్దే బాధ్యత నాది — సరేనా?"

"థాంక్యూ మంజూ! నీ ఋణం ఎట్లా తీర్చుకోవాలో..."

"ఎట్లా తీర్చుకోవాలో తరవాత నేనే చెప్తాలే — సరేనా?"

రామం హుషారుగా కనబడ్డాడు నా మాటలతో.

తరవాత అంతా సరదా మాటలు మాట్లాడుకున్నాం. ఎక్కువ నేనూ, రామమే మాట్లాడింది

రాధ, సుధ శ్రోతలు.

దాదాపు గంటయ్యాక రామం వెళ్లిపోయాడు ఇంటికి.

రాధ నిట్టూర్పు విడిచింది. అంటే ఆమె హృదయం తేలిక పడ్డదన్న మాట! నేనెక్కడ తనని రామంతో పంపించేస్తానేమోనని భయపడ్డది కాబోలు! పిచ్చిపిల్ల!

"ఇదిగో రాధా! ఇది సుధ గది. నువ్వు సుధ — ఈ గదిలోనే వుండండి. సరేనా?"

రాధకి సుధ గది చూపించాను.

"నువ్వెంత మంచిదానివి అక్కా!" అంది రాధ.

నవ్వాను నేను. "సుధ నా కూతురైతే — నువ్వు నా చెల్లెలివి!"

ఆ రాత్రి సుధ — రాధ ఒక మంచంమీదే పడుకున్నారు — సుధ గదిలో —

సుధని నా దగ్గిరే పడుకోబెట్టుకోవాలని నాకున్నా — ఇందాక మా ఇద్దరిమధ్యా జరిగిన



సంభాషణ దృష్ట్యా ఇద్దరం వేరువేరుగానే పడుకుంటే మంచిదని నాకనిపించింది.

అదీగాక — రాధ ఒంటరిగా పడుకోవడం — అందులో మొదటి రోజు రాధకి యిక్కడ పడుకోవడం — నా కంపెనీకంటే సుధ కంపెనీనే

## రాగమాలిక

రాధకి ఎక్కువ శాంతి నిస్తుందని నాకు తెలుసు!
కణతలు నొక్కుకుంటూ పడుకున్నాను.
నిద్ర శూన్యం.
లేచి భగవద్గీత తెరిచాను.

శ్లో. లభంతే బ్రహ్మ నిర్వాణ మృషయః
క్షీణ కల్మషాః
ఛిన్నద్వైథా యతాత్మాన స్సర్వ భూత
హితేరతాః

అర్థం చదువుకుంటూ పడుకున్నాను.

[34వ పేజీ చూడండి]

వాణిశ్రీ శ్రీధర్ నటించు

చిత్రకల్పన

# గోరంత దీపం

ఈస్ట్మన్ కలర్

అన్నపూర్ణ విడుదల

సంగీతం కె.వి.మహదేవన్

ఫొటోగ్రఫీ ఇషాన్ ఆర్య

నిర్మాణం-మాటలు

ముళ్లపూడి వెంకటరమణ

దర్శకుడు బాపు

JAGAPATHI



'చిరంజీవి రాంబాబు' లో ఒక దృశ్యం

## రెండు విదేశీ చిత్రాలలో ఎన్టీఆర్

విదేశాలలో నిర్మింపబడే రెండు భారీ స్కోప్ వర్ణ చిత్రాలకు, "నటరత్న" కాల్‌షీట్లు యిచ్చినట్టు తెలిసింది

శ్రీ బాపయ్య దర్శకత్వంలో, నిర్మాత శ్రీ దయాసాగర్ తలపెట్టినచిత్రానికి కాట్మండు లొకేషన్సు ఎంపిక చేసినట్టు, "మే"లో అక్కడ ఎన్టీఆర్ జయప్రద శ్రీప్రియ పాల్గొనే ప్రధాన సన్నివేశాల చిత్రీకరణ జరుగనున్నట్టు నిర్మాతల ఆత్మీయుడు శ్రీ సాంబశివరావు తెలిపారు

శ్రీ తాతినేని ప్రకాశరావు అనిత ప్రొడక్షన్స్ బ్యానరులో స్కోప్ వర్ణ చిత్రంగా నిర్మించనున్న కొత్తతరహా యాక్షన్ థ్రిల్లర్‌కు సింగపూర్ మలేషియా లొకేషన్లను ఎంపిక చేసినట్టు, జూన్ జులై మాసాలలో ఆ చిత్రానికి శ్రీ ఎన్టీఆర్ తేదీలను కేటాయించినట్టు తెలిసింది

## రాధగా జయప్రద కృష్ణగా శోభన్

ప్రముఖ నిర్మాత శ్రీ దుక్కిపాటి అన్నపూర్ణ కళానికేతన్ అనేడి నూతన చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించడం విఖ్యాత రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన "రాధాకృష్ణ" నవలను రంగుల చిత్రంగా ప్రారంభించడం , రెండు షెడ్యూల్సు పూర్తి గావడం పాఠకులకు తెలిసిన విషయం

కథకు నాయకుడుగా నటిస్తున్న శ్రీ శోభన్ అపురూపమైన "డాక్టర్" పాత్రను పోషించ, అంతే ప్రాధాన్యత గల నాయిక పాత్రను జయప్రద నిర్వహిస్తున్నది

శ్రీ రాఘవేంద్రరావుకు "అవార్డు"ను తెచ్చిపెట్టే కథాబలం వున్న చిత్రంగా "రాధాకృష్ణ"ను పేర్కొనవచ్చు



# * సినిమా విశేషాలు *

## దాసరి చిత్రంలో శోభన్‌బాబు

"బలిపీఠం" తరువాత అగ్ర దర్శకుడు శ్రీ దాసరి శోభన్‌బాబుగారు కలిసి పనిచేసే అవకాశాన్ని శైలజ ఎంటర్ ప్రైజస్ కలిగించారు

నిర్మాతలు శ్రీ ప్రసాద్, శ్రీ కృష్ణ ("ఇంటింటి కథ" నిర్మాతలు) రంగుల్లో నిర్మించే యీ గ్రామీణ చిత్రానికి "మే" నుంచి దర్శక శ్రేష్ఠుడు కాల్‌షీట్లు యిచ్చినట్టు తెలిసింది

హైదరాబాద్ పరిసర ప్రాంతంలోని ఓ చిన్ని గ్రామంలో జరుగనున్న యీ చిత్రానికి "సిరిపురంలో ఓ సిన్నోడు" అని పేరు పెట్టారు

నవలా చిత్రంవలె, యీ గ్రామీణ చిత్రం కూడా విజయాన్ని సాధించాలని కోరుకుందాం

## మావుళ్లయ్య చిత్రానిక దాసరి అంగీకారం

"స్వర్గం నరకం" చిత్రాన్ని నిర్మించిన నిర్మాతత్రయం అగ్రదర్శకుడు శ్రీ దాసరి అంగీకారాన్ని, వారి కొత్త చిత్రానికి పొందిన వార్తను సంక్రాంతి రోజున యీ విలేఖరికి వెల్లడించారు.

ప్రస్తుతం కథాన్వేషణ జరుగుతున్నట్టు, ఏప్రిల్ ప్రాంతంలో నిర్మాణ కార్యక్రమం ప్రారంభం కాబోతున్నట్టు, నిర్మాత శ్రీ మావుళ్లయ్య తెలిపారు

## వీనస్ మహీజా సాంఘికం

"యశోద కృష్ణ" వర్ణ చిత్రాన్ని నిర్మించి యావద్భారత ఖ్యాతి నార్జించిన శ్రీ చెరుకూరి ప్రకాశరావు "పాంచాలి కథ" తీయడానికి ముందు ఓ సాంఘికాన్ని రూపొందిస్తారని తెలిసింది

## రామకృష్ణ కృష్ణుడుగా భక్త కుచేల

"నటరత్న" శ్రీ రామారావు తరువాత కృష్ణుడుగా రాణించిన నటుడు శ్రీ రామకృష్ణ అనేడి నిజం అందరికీ తెలుసు

రామకృష్ణగారిని కృష్ణుడుగా, "భక్త కుచేల" వర్ణ చిత్రాన్ని ఒక ప్రముఖ సంస్థ ఏప్రిల్‌లో ప్రారంభించడానికి నిర్ణయించింది

కుచేల పాత్రను ఒక అగ్రశ్రేణి నటుడు పోషించగలరని, ఓ విఖ్యాత దర్శకుడు నిర్దేశకత్వాన్ని నిర్వహించగలరని తెలిసింది

## మార్చి నుంచి శ్రీమూర్తి కొత్త చిత్రం

హీరో కృష్ణతోనే చిత్రాలను నిర్మిస్తామని ప్రకటించి, తదనుగుణంగా వ్యవహరిస్తున్న నిర్మాతలు శ్రీ బాబ్జి శ్రీ సాంబశివరావు యీసారి సొంతంగా ఓ రమణీయమైన కథను వ్రాసుకున్నారు శ్రీ దాస్ దర్శకత్వాన్ని, కృష్ణ జయప్రద ముఖ్య పాత్రన్ని నిర్వహిస్తారు

## రాబోయే కృష్ణ చిత్రాలు ఎలా వుంటాయి?

కొత్త సంవత్సరం హీరో కృష్ణకు ఆశాజనకంగా ఆరంభమైంది (ఇంద్రధనుస్సు)

ఫిబ్రవరి 23 న విడుదల అయ్యే "అల్లరి బుల్లోడు", మార్చిలో వచ్చే అన్నదమ్ముల సవాల్, ఏప్రిల్‌లో రానున్న ఏజెంట్ గోపీ, మేలో రాదగిన ముగ్గురూ ముగ్గురే, జూన్‌లో వచ్చే చెప్పింది చేస్తా చిత్రాలలో కృష్ణ జనరంజకమయ్యే పాత్రలను పోషించారు

ఫిబ్రవరి 3 న వచ్చిన "పట్నవాసం"లో కోయదొరగా కృష్ణ "మాస్"ను విపరీతంగా ఆకర్షించారు

1978 లో కృష్ణగారి నట జీవిత జాతకం బ్రహ్మాండంగా వుంటుంది

—శ్రీనివాస్ ★

'చల్ మోహనరంగ'లో దీప



# ఫిల్మోత్సవ్ -

## కొన్ని విదేశీ చిత్రాల పరిశీలన

జనవరి 3న మద్రాసులో కేంద్ర ఆకాశవాణి-సమాచార శాఖామాత్యులు శ్రీ ఎల్. కె. అద్వానీ ప్రారంభించిన ఏలన చిత్రోత్సవం జనవరి 16న ముగిసింది. అవభృధోత్సవానికి ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి అధ్యక్షత వహించారు.

**చైనీస్ రౌలెట్ :**

[ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ – ఫ్రాన్స్ సంయుక్తంగా నిర్మించిన చిత్రం 90 ని.లు] భార్యాభర్తలు దూరాన ఒక ఎస్టేట్‌లోని విడిది మందిరంలో తమ ప్రేమికులను కలుసుకోడానికి ఒకరికి తెలియకుండా మరొకరు వెళ్తారు. జంట ద్వారా తారసపడి కాస్త చిన్నబుచ్చుకున్నా - ఆ తర్వాత తమాయించుకొని ఖులాసాగా వుంటారు. ఆ దంపతుల అవిటికాలు గల పదేళ్ళ కూతురు తన పరిచారిక సాయంతో ఆ బంగళాకే వస్తుంది. దాంతో ఆ దంపతులు ఇరుకున పడతారు. ఆ నలుగురినీ ఆ అమ్మాయి ఒకచోట చేర్చి ''చైనీస్ రౌలెట్'' ఆట ద్వారా వారి మనోభావాలు బహిర్గతమయ్యేలా చేయడమే ఈ చిత్రంలోని ప్రధాన ఇతివృత్తం. చిన్న చిత్రమైనా విసుగు కలిగిస్తుంది. సాంకేతికంగా ఫరవాలేదు.

**పాద్రె – పాద్రోన్**

(ఫాదర్ – మాస్టర్ అనే ఇటాలియన్ చిత్రం 110 ని లు) గావినోలెడ్డా అనే విఖ్యాత పండితుని ఆత్మకథ. గావినో స్టూడియో సెట్‌లో తన ఆత్మకథ చిత్రీకరణలో సాయపడుతూ పరిచయం గావింపబడడంతో చిత్రం ప్రారంభమౌతుంది. బాగా చదువుకొని వృద్ధికి రావాలనుకునే ఒక బాలుని గొర్రెల కాపరియైన తండ్రి చదువు మాన్పించి, వంశపారంపర్యంగా వస్తూన్న వృత్తిని చేపట్టమని ఆదేశిస్తాడు. అది ఆ అబ్బాయికి ఇష్టంలేదు. తన కొడుక్కు స్వతంత్ర భావాలు వుంటాయని గుర్తించలేని ఆ తండ్రికి—కొడుక్కి మధ్య ఘర్షణ జరుగుతూనే వుంటుంది ఆ కొడుకు పెద్దయ్యాక ఇంజనీరింగ్ నేర్చుకొని, రేడియో తయారు చేస్తాడుకూడా. చివరి షాట్‌లో సైతం సుప్రసిద్ధ రచయితగా వాసికెక్కి తన గ్రామీణుల స్థితిగతులను పరిశీలించడానికి తన గ్రామానికే తిరిగి వచ్చిన గావినోను మళ్ళీ చూపిస్తారు. ఈ చిత్రంలో స్వరతులు, ఉపరతులు, కోళ్ళు, మృగాలతో కామవాంఛను తీర్చుకోడానికి యువకులు చేసే చేష్టలు జుగుప్సాకరంగా వున్నాయి ఛాయాగ్రహణం బావుంది.

**ఓ గాడ్ !**

(యు. ఎస్. ఎ. 104 ని.లు.) డిపార్ట్‌మెంటల్ స్టోర్స్‌లో పని చేసే ఒక సేల్స్‌మన్‌కు భగవంతునితో ఇంటర్వ్యూ జరుగుతుంది ఆ విషయం ఎవ్వరూ నమ్మరు అతన్ని ఓ పిచ్చివాడి కింద జమకడ్తారు ఉద్యోగంకూడా పోగొట్టుకుంటాడు మాఎవరూపంలో కనిపించిన 'భగవంతుడు' ఒక ప్రీస్టు తన పేరు చెప్పి అక్రమంగా ధనం సంపాదిస్తున్నాడని తనతో ఫిర్యాదు చేసినట్లు చెప్తాడు ఆ ప్రీస్టు పరువునష్టం దావా వేస్తాడు భగవంతుడు హీరో తరఫున జయం కలగడంకోసం కోర్టు హాలులో తన మహాత్యం చూపవలసివస్తుంది

**జస్ట్ ఎ వుమన్**

(ఫ్రాన్స్ – 100 ని లు ) ఒక్కని స్క్రిప్టు ఇటల్లో మనశ్శాంతిలేని ఒక లేడీ డాక్టర్‌కు సిగరెట్ అలవాటుంది కాని, రోగులను మాత్రం సిగరెట్లు తాగొద్దని హెచ్చరిస్తూంటుంది. ఆమెకు దగ్గు ప్రారంభమవుతుంది ముందు



'ఓ గాడ్' లో ఒక దృశ్యం



'టాక్సీ డ్రైవర్'



'ముగ్గురూ ముగ్గురే'లో జయచిత్ర, కృష్ణ

# '78 చిత్రాలు వాటి విశేషాలు!

పట్టించుకోదు ఆ తర్వాత ఎక్స్‌రే తీసి చూసుకుంటే కాన్సర్ చిహ్నాలు కనిపిస్తాయి అదివరకు రోగుల మానసికావేదనను చూస్తూ వచ్చిన ఆ లేడీ డాక్టర్ ఆవేదనకు గురవుతుంది కాని, చివరికి మనోనిబ్బరంతో శస్త్రచికిత్స చేయించుకొని, స్వస్థతను పొందుతుంది. ఇది వాస్తవిక గాథ హీరోయిన్ వయసు దాదాపు 40 ఏళ్ళున్నా – ఎంతో అందంగా వుంది. కొన్ని కొన్నిచోట్ల ఆమె నటన శిఖరాగ్రాలను అందుకుంటుంది. ఎక్కడా విసుగు కలిగించకుండా కథను నడిపించిన దర్శకుడు యెంతైనా అభినందనీయుడు

*టాక్సీ డ్రైవర్*

(యు ఎస్ ఎ – 112 ని లు) మద్రాసులో పెద్ద సంచలనం కలిగించిన చిత్రమిది. రంజింపజేసే సన్నివేశాలు పుష్కలంగా వున్నాయని ముందుగా యెందుకు విపరీతమైన ప్రచారం జరిగిందోకాని, థియేటర్‌వద్ద టిక్కెట్లకోసం ముందురోజు రాత్రినించే అసంఖ్యాకమైన జనం 'క్యూ'లో నిలుచొని పడిగాపులుపడ్డారు. దొమ్మీ జరిగి పోలీసులు లాఠీలు, బాష్పవాయువు ప్రయోగించవలసివచ్చింది తీరా, చిత్రం చూశాక చాలామంది నిరాశచెంది వుండొచ్చు అమెరికాలో విశృంఖలంగా సాగుతూన్న నిశి జీవితంలోని అస్తవ్యస్త వ్యవహారాలను చక్కబెట్టాలనుకున్న హీరో టాక్సీ డ్రయివర్, వేశ్యా గృహంలోంచి ఐరిష్ అనే ఒక యువతిని రక్షించడంకోసం సాహసిస్తాడు. ఆ తర్వాత మామూలుగా టాక్సీ నడుపుకుంటూ జీవయాత్ర సాగిస్తుంటాడు ఈ చిత్రంలో వినిపించే కొన్ని బూతుమాటలు కర్ణకఠోరంగా వున్నాయి. ఛాయాగ్రహణం మాత్రం చక్కగా వుంది



'జస్ట్ వుమన్'లో ఒక దృశ్యం



'మంచి బాబాయ్'లో మోహన్‌బాబు, జయసుధ

## ఫిల్మోత్సవ్

**ది లాస్ట్ టైకూన్**

(యు. ఎస్. ఎ. 135 ని.లు.) ఎఫ్ స్కాట్ ఫిట్జ్ గెరాల్డ్ అసంపూర్ణ నవల ఆధారంగా తయారైన ఈ చిత్రంలో ఒకానొక హాలీవుడ్ స్టూడియో ఎగ్జిక్యూటివ్ ఉద్యోగరీత్యా విజయాలు సాధించినా — వ్యక్తిగత జీవితంలో అపజయాన్ని చవిచూడవలసివస్తుంది. అతను ప్రేమించిన యువతి అతని మూలంగా తను ఆశించిన ప్రశాంతత లభించిందని గుర్తించి, తప్పుకుంటుంది. తన ఘనవిజయాలన్నైనా ఆమె గుర్తించలేదే అన్న బెంగతో పతనమైనా — మామూలుగా తన విధులు నిర్వహించుకోడానికి చివరికి గుండెనిబ్బరం చేసుకోగలుగుతాడు. హృదయాలకు హత్తుకునే పలు అంశాలు గల ఈ చిత్రంలో శృంగార దృశ్యాలు మితిమీరి వున్నాయి. ఛాయాగ్రహణం, సంగీతం ప్రత్యేక ఆకర్షణలు

**ది లేస్ మేకర్**

(ఫ్రాన్స్ — స్విట్జర్లాండ్ — ఎఫ్. ఆర్. జి— 100 ని.లు ) ఒక బ్యూటీ సెలూన్‌లో పని చేసే అందమైన యువతి ఒక యూనివర్శిటీ విద్యార్థిని ప్రేమిస్తుంది, కొన్ని అభిప్రాయభేదాలు వారి మధ్య అగాధాన్ని సృష్టిస్తాయి. ఆమె మానసికంగా, శారీరకంగా క్రుంగిపోతుంది వారిద్దరి మధ్య సెక్స్ దృశ్యాలు కొన్ని వున్న ఈ చిత్రంలో పలుచోట్ల దర్శకుని ప్రతిభ కనిపిస్తుంది.

**ది డూమ్**

(రొమేనియా. 118 ని.లు.) ఒక భూస్వామిని హతమార్చినందుకు పదేళ్ళు కారాగార శిక్ష, రెండేళ్ళు రణరంగంలో గడిపి, తిరిగి వచ్చిన ఒక వ్యక్తి తన భార్య మరొకతన్ని పెళ్లి చేసుకుందని తెలుసుకుంటాడు. తన భార్య అమ్మివేసిన ఆస్తిపాస్తులను తిరిగి పొందడంకోసం వాటిని ఖరీదుచేసిన హతుని బంధువు దగ్గరే ఉద్యోగం చేస్తుంటాడు. ఇంతలో ఆ యజమానిని దోపిడీగాళ్ళు చంపేస్తారు. మాజీ నేరస్థుడవడం మూలంగా హీరో మీదనే నేరం మోపబడుతుంది. అతన్ని మోహించిన హతుని భార్య — పోలీసుల, గ్రామీణుల బారి నుండి తప్పించుకొని పారిపొమ్మంటుంది. అలాగే అతను ఎన్నో తంటాలుపడి తప్పించుకోగలుగుతాడు. మరణించిన అతని మిత్రుని కూతురు అతన్నే తన భర్తగా భావిస్తుంది. అతనామెతో పరారై, చివరిసారిగా తప్పించుకునే సమయంలో ఆమె నెలలునిండని శిశువును ప్రసవించి, అతని చేతుల్లోనే కళ్ళుమూస్తుంది. తనకు జాలి అంటే ఏమిటో చవిచూపిన 'కరుణ'ను అలా సమాధి చేశాక తను కూడా చావడానికి సిద్ధపడతాడు. నాటి ధనికవర్గంవారి ఆగడాలు, పోలీసుల జులుం ఉద్రేకపూరితంగా చిత్రీకరించబడ్డాయి సాంకేతిక ప్రమాణాలు ఉన్నతస్థాయిలో వున్నాయి.

**లే గ్రాండ్ సాయిర్**

(స్విట్జర్లాండ్... 95 ని.లు ... "విప్లవానికి ముందు రాత్రి") నాటి స్విట్జర్లాండ్ రాజకీయ పరిస్థితులను ప్రతిబింబించే ఈ చిత్రంలో మార్క్సిజంలోకి యువతరం ఎలా ఆకర్షితులవుతున్నారో ప్రధాన ఇతివృత్తం. కాపలాదారుడుగా పని చేసే ఒక యువకుడు ఒక కమ్యూనిస్టు యువతి ప్రోద్బలంతో కార్మిక పోరాటంలో ముఖ్య పాత్ర వహిస్తాడు. ధనికవర్గాన్ని నిర్మూలించేందుకు ఒక ఆయుధ కర్మాగారంపై దోపిడీ చేసి, ఆ ఆయుధాలను తన అనుచరులకు అందిస్తాడేకాని వాళ్ళు సాహసించి, సహకరించకపోవడంతో అతనికి కఠిన కారాగారవాస శిక్ష పడుతుంది. కమ్యూనిస్టు ఉద్యమాలను వ్యంగ్యంగా చిత్రించే ఈ చిత్రంలో సుదీర్ఘమైన సంభాషణలున్నాయి. ఛాయాగ్రహణం విందుగా వుంది.

**గిలియాప్**

(స్వీడన్. 125 ని.లు.) ఒక పట్టణంలోని పెద్ద హోటల్ చుట్టూ జరుగుతుంది కథ. కొత్తగా వెయిటర్‌గా చేరిన ఓ యువకుడు ఆ హోటల్లో పని చేసే ఒక అందమైన వనితను ప్రేమిస్తాడు ఆమె ముందు నిర్లక్ష్యం వహించినా — ఆటుపైన అతనివంక మనసు మొగ్గేసరికి అతను ఏలుకోలేని దుస్థితికి జారిపోతాడు. కాస్త క్రియేటివ్ ఎలిమెంట్స్ వున్నా— కథ మందగమనంతో సాగడంవలన అంతగా రక్తికట్టలేదు. సంభాషణలు మోతాదుమించి వున్నాయి. ఛాయాగ్రహణం తప్ప చెప్పుకోదగ్గ అంశాలేమీ లేవు

**ఒక్సలి పోస్ట్‌కార్డ్ విత్ వైల్డ్ ఫ్లవర్స్**

(రొమేనియా 95 ని.లు ) ఒక యదార్థ గాథ ప్రేరణతో తయారైన చిత్రమిది. మరో యువతిని వివాహమాడిన ఒక యువకుని మూలంగా తాను మాతృమూర్తి కాబోతున్నానని బెంగపడిన ఓ యువతి తన స్నేహితురాలి ద్వారా గర్భస్రావానికి ప్రయత్నిస్తుంది. ఐతే, మందు మోతాదు మించినందువల్ల మరణిస్తుంది. ఆమె స్నేహితురాలి తల్లి, గర్భస్రావానికి తోడ్పడిన మరో స్త్రీ — ఆ యువతి శవాన్ని దాచిపెడతారు. ఆ నేరం నుంచి తప్పించుకోడానికి నానాయాతనలు పడతారు. కాని, ఆ యువతి మృతికి తానే కారకురాలని ఆ స్నేహితురాలు ఆత్మహత్య చేసుకుంటుంది గర్భస్రావం ఎటువంటి విపరీతమైన పరిణామాలకు దారితీస్తుందో అక్కడక్కడ సున్నితమైన హాస్యంతో చెప్పే చక్కని చిత్రం.

**ఆబ్‌డక్షన్**

(యు. ఎస్ ఎ—95 ని. లు.) పేదలకు తక్కువ అద్దెలో ఇళ్ళు నిర్మించడానికి ప్రభుత్వం కేటాయించిన ధనాన్ని దుర్వినియోగం చేసి తన కోసం ఒక పెద్ద భవంతిని నిర్మించుకున్న ఒక ధనవంతుని కుమార్తెను పౌర్ణస్యంగా తీవ్రవాదుల ముఠా ఎత్తుకుపోతారు. ఆ భవంతిని నేలమట్టం చేయకపోతే ఆ యువతిని నానా హింసలు పెట్టి చంపుతామని బెదిరిస్తూ ఒక టేపు, చేతులు కాళ్లను తాళ్లతో కట్టేసి ఆ యువతిని బలవంతంగా పైశాచికంగా రమించేటప్పటి సంభాషణ వున్న మరో టేపుతో సహా ఆమె తల్లిదండ్రులకు, ప్రభుత్వానికి పంపిస్తారు తండ్రికి తన కూతురు ప్రాణం కన్నా తన ఐశ్వర్యమే ముఖ్యం. ఆ యువతి అనుకోకుండా శారీరక సుఖాన్ని చవి చూడడమే కాకుండా, తన తండ్రి చేసిన అన్యాయాన్ని తెలుసుకొనడంతో ఆ ఉగ్రవాదుల ఆశయాన్నిగుర్తిస్తుంది. ఎఫ్. బి. ఐ. రక్షణ శాఖ వారు రావడంతో వారి పైనే తుపాకులు ప్రేల్చి, ఆ విప్లవకారులను రక్షిస్తుంది. ప్రతి మనిషిలో మంచీ చెడూ ఉంటాయి ఏది ఎప్పుడు విజృంభిస్తుందో చెప్పడం ఎవ్వరి తరమూ కాదు అనే విషయాన్ని చెప్పడానికి భయానకమైన దృశ్యాలు, శృంగార సన్నివేశాలను హద్దుమీరి చిత్రించడం జరిగింది. ఐతే అత్యుత్తమమైన నిర్మాణపు విలువలు కొన్ని కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి.

**ది లైఫ్ ఆఫ్ ఛికుజాన్**

(జపాన్ 120 ని లు.) జపాన్‌లో ఇప్పటికీ మారుమ్రోగే జానపద సంగీతాన్ని ఒక జంత్ర వాయిద్యం ద్వారా కమ్మగా వినిపించే అంధుడు మనసిచ్చిన మగువ చెయ్యి దాటి పోతుంది. ఒక గుడ్డి యువతి అతని జీవితానికి, సంగీతానికి నూతనోత్సాహం కలిగిస్తుంది. సృష్టిలో తీయనిది స్నేహమని చాటి చెప్పే ఈ చిత్రంలో మనసులను ఆకట్టుకునే సన్నివేశాలెన్నో ఉన్నాయి ఇంపైన సంగీతం, చక్కని చిత్రీకరణగల ఈ చిత్ర నిర్మాణానికి రెండున్నర ఏళ్లు పట్టిందట

[ఇంకా వుంది]

'విచిత్ర జీవితం'లో ఒక దృశ్యం



# జి. వి. జి. పేజీ

## రాముడు - రంగడు

"గ్రామీణ వాతావరణానికి చెందిన ఇతివృత్తానికి సహజత్వాన్ని కల్గించడంకోసం. కృష్ణా జిల్లాలోని ఉయ్యూరు పరిసర ప్రాంతాల లోని గ్రామాలలో షూటింగ్ జరపదలిచాం," అన్నారు తమ్మా రంగారెడ్డి సమర్పించే భారతి ఆర్ట్ క్రియేషన్స్ "రాముడు – రంగడు" వర్ణ చిత్రానికి దర్శకత్వం వహించే పి. చంద్రశేఖరరెడ్డి. మార్చిలో షూటింగ్ ప్రారంభమౌతుంది. కృష్ణంరాజు, శ్రీధర్, ప్రభ, రావుగోపాలరావు ప్రభృత తారాగణం. మోదుకూరి జాన్సన్ మాటలు, పి. ఎస్. ప్రకాష్ ఛాయ, చక్రవర్తి సంగీత దర్శకత్వం నెఱపే ఈ చిత్రానికి తమ్మా రఘునాథరెడ్డి నిర్మాత. నిర్వహణ ; బి. బుచ్చిరెడ్డి.

## సీపిరి గీపిరి బాస్కి

సీతాలు వంట చేస్తోంది. సామాన్లు పెట్టుకో డానికి కట్టిన అరుగుమీద చిద్విలాసంగా పడుకొని ఉన్నాడు కొండయ్య. ఇంతలో రవి వచ్చాడు. సీతాలు వంక చూసి, "హలో సరితాదేవిగారూ!" అని పలకరించాడు. "ఆ పేరేంటి బాబూ, దాని పేరు సీతాలైతేనూ" అన్నాడు కొండయ్య విస్తుపోతూ. "సీతాలన్నది నిన్నటివరకూ మీకూ— మీ ఊరికీ తెలిసినది సరితాదేవన్నది రేపటినించీ మాకూ — మా ఊరికీ తెలియాల్సిన పేరు. అవునూ — మీరే వంట చేస్తున్నారు. ఇవాళ వంటమనిషి రాలేదా ?... ఐ...సీ... తీరిక వేళల్లో తీరుబడిగా వంట చెయ్యడం మీ హాబీ అన్న మాట... గుడ్. ఏమిటలా చూస్తారు ? రేపట్నించీ పత్రికలవాళ్ళు యిలాంటి ప్రశ్నలే వేస్తారు. వాటికి స్టైల్‌గా జవాబు లిస్తూండాలి... చూడు. అంగడిలో పెడితే 'బిళ్ళ' అంటారు దాని ఖరీదు రెండు పైసలు. దాన్నే రంగు కాగితంలో చుట్టి గాజు సీసాల్లో పెడితే 'స్వీట్' అంటారు. ఈ 'స్వీట్' ఖరీదు పది పైసలు. విలువ బిళ్ళకు కాదు దాన్ని చుట్టిన రంగు కాగితానికి. అలాగే యిక్కడ గౌరవం మనిషికి కాదు. వాళ్ళు చూపించే దర్పానికి, దర్జాకి ఏదీ — ఈసారి తడుము కోకుండా జవాబు చెప్పండి. మీ అభిమాన రచయిత ఎవరు ?" అడిగాడు రవి. "సీపిరి గీపిరి బాస్కి" అంది సీతాలు. రవి నివ్వెరపోతూ, "వాడెవడు ?" అన్నాడు. "మీరేగా తడుముకోకుండా చెప్ప మన్నారు ? సీపిరి గీపిరి బాస్కి" అంది సీతాలు. ఈ హాస్య సన్నివేశం యువ చిత్రవారి "సీతా మాలక్ష్మి" లోనిది. సీతాలుగా తాళ్ళూరి రామేశ్వరి, కొండయ్యగా చంద్రమోహన్, రవిగా శ్రీధర్ పాత్రధారులు. కె. మురారి నిర్మాత. కె. విశ్వనాథ్ దర్శకుడు. కె నరసింహంనాయుడు సమర్పించే ఈ చిత్రం ఫిబ్రవరి విడుదల.



'పరశురామ ప్రతిజ్ఞ'లో హాలం

# జి. వి. జి. పేజీ

### ఇంకో వ్యక్తిని పెళ్లి చేసుకో

ప్రియ, ప్రకాష్‌లకు పెళ్లయింది. ప్రకాష్ దిండు, దుప్పటి తీసుకొని పోబోతే ప్రియ "ఏమండీ, ఎందుకిలా కోర్కెల్ని చంపేసుకొని బ్రతుకుతారు? కావాలని మిమ్మల్ని మీరే ఎందుకిలా శిక్షించుకుంటున్నారు?" అంది ఆవేదనతో. "క్షణికమైన నా సుఖంకోసం అందమైన నీ భవిష్యత్తును పాడుచెయ్యడం యిష్టంలేక ... నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. నువ్వు చదువుకున్నదానివి. పరిస్థితిని అర్థంచేసుకోగలదానివి. నేను పోయాక యింకో వ్యక్తిని పెళ్లి చేసుకొని హాయిగా కాపురం చేసుకో," అన్నాడు ప్రకాష్. ప్రియ "ఎంత తేలిగ్గా అనేశారండీ ఆ మాట? మీరు లేకపోతే బ్రతుకు లేదనీ, మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలనీ — అంత ఎత్తు నుంచి నీళ్లలోకి దూకానే! సమయానికి మీరు ఆదుకోకపోయినా, నీటిలో ఏ రాయో రప్పో తలకు కొట్టుకున్నా—ప్రమాదమని తెలిసినా అంత ధైర్యం చేశానే, అటువంటిదాన్ని మీరు వెళ్లిపోయాక యింకా బ్రతికేవుంటానని మీరెలా అనుకుంటున్నారు? యింకొక వ్యక్తిని పెళ్లి చేసుకుంటానని ఎలా ఊహించుకుంటున్నారు? ఆడదాని భవిష్యత్తు భర్తతో, బిడ్డతో ముడిపడి వుంటుందండీ," అంది. ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "సూర్యచంద్రులు"లో చంద్రమోహన్, లత పాల్గొన్న సన్నివేశం కె. రాఘవ నిర్మాత, గుహనాథన్ దర్శకుడు.

### వియ్యాలవారి కయ్యాలు

విఘ్నప్రియా ఆర్ట్ పిక్చర్స్ "వియ్యాలవారి కయ్యాలు" వర్ణచిత్రంలో కృష్ణ, నాగభూషణం, రావు గోపాలరావు, మాడా, సత్యేంద్రకుమార్, పి. ఎల్. నారాయణ, జయప్రద, సూర్యకాంతం, ఎస్ వరలక్ష్మి, ఛాయాదేవి నటిస్తారు. కట్టా సుబ్బారావు తొలిసారిగా దర్శకత్వ బాధ్యతను చేపట్టే ఈ చిత్రానికి జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి, మూల రంగయ్య నిర్మాతలు. ఎస్. ఎస్. నారాయణ, ఎం. వి సుబ్బారావు సహ నిర్మాతలు జంధ్యాల రచన, సత్యం సంగీతం, వెంకట్ ఛాయ నిర్వహిస్తారు.

జనవరి 21న జరిగిన సినీ కళాకారుల ఉత్సవంలో జయసుధ, జయప్రద, ఏ నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు. —ఫోటో : శ్రీధర్.





'సూర్య చంద్రులు'లో చంద్రమోహన్, లత

### ప్రాణమిత్రుల మధ్య కక్షలు

"రజనీ! నేను మారిమాత్రమే రాలేదు. నువ్వొక హంతకుడివనే సంగతి తెలుసుకుని మరీ వచ్చాను. అందుకే చెప్తున్నాను — పోలీసులకు లొంగిపోవడం నీకు మంచిది," అన్నాడు మదన్. "నిన్న మిత్రుడు. రేపు శత్రువు. నేడు సి. ఐ. డి. మోహన్! నీకు మళ్లీ చెబుతున్నాను. సరెండర్ కావడం అవమానం. మారిపోవడం హీనం. ఈ విధంగానే బ్రతకడం ఆనందం. నువ్వేమంటావ్?" అన్నాడు రజని. "ఈరోజు నుంచీ నీకూ — నాకూ కురుక్షేత్ర యుద్ధం మొదలయింది. ఇది మొదటిరోజు. ఇంకో పదిహేడురోజులున్నాయి," అని మదన్ అంటే "మాకు అన్నిరోజులు అవసరంలేదు," అన్నాడు రజని. ప్రాణమిత్రుల మధ్య కక్షలు బయలుదేరితే ఎంతటి తీవ్ర పరిణామాలకు దారితీస్తుందో తెలిపే ఈ సన్నివేశం గీతా కంబైన్స్ "ఎత్తుకు పైయెత్తు" చిత్రంలోనిది. కమలహాసన్, రజనీకాంత్ — మదన్, రజని పాత్రధారులు. సత్యనారాయణ, అల్లురామలింగయ్య, సంగీత, శ్రీప్రియ, శుభ, అపర్ణ ఇతర ముఖ్యపాత్రధారులు. అల్లు అరవింద నిర్మించే ఈ చిత్రం ఫిబ్రవరి విడుదల.

### బాపు హిందీ సినిమా రంగానికి

"వండర్‌ఫుల్, నాకో చిత్రాన్ని డైరెక్షన్ చేసిపెట్టాలి మీరు" అన్నాడు హిందీ నటుడు శశికపూర్ "గోరంత దీపం" చిత్రం చూశాక డైరెక్టర్ బాపును మనసారా అభినందిస్తూ. బాపు లోగడ రూపొందించిన ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ "సీతా కల్యాణం" వర్ణ చిత్రాన్ని లండన్ చలన చిత్రోత్సవ కార్యక్రమాల డైరెక్టర్ కెన్‌వలాషన్, 'టైమ్స్' లండన్ పత్రిక విమర్శకుడు డెరెక్ మాల్కమ్ ఇటీవల మద్రాసు 'ఫిల్మోత్సవ్'లో ప్రత్యేకంగా చూసి ముగ్ధులై — భారతదేశంలో ఇటువంటి మనోహర చిత్రాలు తీస్తున్నారని తమ కిప్పుడే తెలిసిందన్నారు. అన్ని విధాలా విశిష్టంగా వున్న ఈ చిత్రాన్ని తమ దేశంలో పిల్లలూ పెద్దలూ కూడా తప్పక ఆసక్తితో చూస్తారన్న నమ్మకం తమకు ఉందన్నారు. ★

'ఎత్తుకి పై ఎత్తు'లో శ్రీప్రియ



# ఈ 8 కారణాలకోసం...

























# భారతపు ప్రథమ ప్రెషర్ కుకర్ నేడు కూడా విపులంగా ఉపయోగింపబడుతున్నది



**Prestige**

ప్రెస్టీజ్
టి.టి. (ప్రైవేట్) లి.
బెంగళూరు-560 016

MCA/TT/50-Tel



))))))))))) 'పంతులమ్మ' లో ఒక దృశ్యం ((((((((((

# రాగమాలిక

[24వ పేజీ తరువాయి]

## 16

సుధ, రాధ బాగా దగ్గరైపోయారు

సుధ 'ఆంటీ, ఆంటీ' అంటూ రాధని వదలడంలేదు.

రాధ కూడా సుధని అంటిపెట్టుకునే వుంటోంది.

సుధ పన్లన్నీ రాధే చేస్తోంది. దాన్ని రోజుకోవిధంగా ముస్తాబుచేసి మురిసిపోతోంది.

ఇద్దరూ రకరకాల ఆటలు ఆడేవాళ్లు ఒకవిధంగా నాకూ ఇది హాయిగానే వుంది.

లేకపోతే సుధ అడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పే శక్తి నాకు లేదు.

దానిక్కూడా నిర్లిప్తంగావుండే నన్ను చూస్తే విచారంగా వుంటుంది. బాధగా వుంటుంది. ఆ బాధతో అదీ నిశ్శబ్దంగా — నిస్తబ్దగా అయిపోతోంది.

చలాకీతనం అంతా పోయింది.

దానికోసం యిదివరకులా నేనూ ఉత్సాహాన్ని తెచ్చుకోలేకపోతున్నాను.

ఎన్నాళ్లు యిట్లా దాన్ని ఊరుకోబెట్టలను? ఎప్పుడో అప్పుడు దానికంతా చెప్పక తప్పదు.

చెప్తే విని అదేం చేస్తుంది?

ఇప్పటికే దానికి కొంతలో కొంత తెలిసింది! ఇంక నేను కూడా చెప్పింది విని, తండ్రిమీద ద్వేషం పెంచుకుంటుంది.

వద్దు వద్దు! అది తండ్రి మీద ద్వేషం పెంచుకోకూడదు. తండ్రికి దూరం కాకూడదు.

ఏదో ఒక విధంగా యిప్పుడు తండ్రి ప్రేమ పొందుతున్నారు - పిల్లలు.

మేము ఒకచోట లేకపోయినా — పిల్లలకి తల్లి—తండ్రుల ప్రేమలు లభిస్తున్నాయి

కానీ నేను అంతా చెప్పేస్తే పిల్లలు తండ్రికి దూరమయిపోతారు.

తరవాత ఏమనుకునీ లాభం వుండదు. చిన్నపిల్లల మనసులు చాలా సున్నితంగా వుంటాయి. ఏదైనా ఒక ముద్ర పడిందంటే — వాళ్ల మనసుల్లో — అది జీవిత కాలమంతా మాయదు

వాళ్ల మనస్తత్వాన్నిబట్టి మనం నడుచుకోవాలి. ఇప్పుడు నా కర్తవ్యం—వీలైనన్ని రోజులు అంతా దాచిపెట్టడమే. అదే మంచిది.

ఇప్పుడు పరిస్థితి దానికి అనుకూలంగానే వుంది.

పెద్దయి — వాళ్లు అర్థం చేసుకోగలిగితే అప్పుడు — అప్పుడు చెప్పాలి. అంతే!

సుధ యిప్పుడా విషయమే ఆలోచించడంలేదు. రాధతో ఆటపాటలతో హాయిగా — చలాకీగా వుంది

నాక్కావల్సింది అదే!

రాధ కూడా సుధ సాహచర్యంలో తన బాధని మెల్లిగా మర్చిపోతోంది.

రాధకి చక్కటి సంగీతం వచ్చు.

మీరా భజన్లూ అవీ సుధకి నేర్పిస్తోంది.

సుధ గొంతు కిన్నెర కంఠమే.

స్కూల్లో సంగీతం, వీణ నేర్చుకుంటోంది.

వాళ్ల స్కూల్లో సంగీతం, డాన్సులకు ప్రత్యేక విభాగం వుంది

ఎన్నో డాన్సు ప్రోగ్రాముల్లో కూడా పాల్గొంది సుధ. ఫొటోలు కొన్ని తెచ్చింది నాకు చూపించడానికి.

చాలా చక్కగా వుంది డాన్స్ డ్రస్సులో సుధ.

వాళ్ల స్కూలు ఆవరణలో పెద్ద మర్రిచెట్టు వుందిట. దాని కింద స్టేజిలాగ కట్టారుట. అక్కడే వీళ్ల డాన్స్ ప్రోగ్రాములు జరిగేవి.

ఊడలన్నీ విస్తరించి ఎంతో బావుందా మర్రిచెట్టు ఫొటోలోనే అంత బావుంది. ఇంక నిజంగా చూస్తే? చూడాలి తప్పకుండా — అనుకున్నాను.

ఒక వీణ కూడా కొనాలనుకుంటున్నాను — సుధకి. చిన్నప్పటినించీ డాన్స్, వీణ, సంగీతం అంటే నాకు చాలా యిష్టం కానీ నేను ఏదీ నేర్చుకోలేకపోయాను. కనీసం నా కూతురయినా యివి నేర్చుకుంటే నా కంతకంటే సంతోషం ఏముంటుంది?

ఈ స్కూలు మాకో వరమే

తల్లిదండ్రుల్ని మరిపించే టీచర్లు.

స్కూలు కెళితే ప్రతి పిల్లా, పిల్లవాడూ యింటిని పూర్తిగా మర్చిపోతారు. ఎక్కడో సుధ లాంటి వాళ్లు వుంటారు. కానీ కొంతవరకు సుధ కూడా అక్కడ హాయిగానే వుంటుంది ఇంటికొస్తేనే దానికి నన్ను చూసి బాధ మొదలవుతుంది.

మధు కూడా మృదంగం నేర్చుకుంటున్నాడు.

బాటిక్ వర్క్, కార్పెంటరీ అన్నీ నేర్చుకుంటున్నాడు.

[ఇంకా వుంది]

## పూర్తికాని డైరీ

(17వ పేజీ తరువాయి)

నేను మౌనంగా తింటున్నాను. అనుకోకుండా అతనివైపు చూస్తే అతను నావైపే చూస్తున్నాడు. నాకు మహాభయమేస్తుంది. ఎంత ధైర్యంగా చూస్తాడు! నా జీవితంలో నాకు నేనుగా ఎవర్నీ ప్రేమించలేదు. రామకృష్ణ, బావ తనను ప్రేమించారు కానీ కానెప్పుడూ తనకు తానుగా ప్రేమించలేదు. అందుకేనేమో ఆ ఇద్దరూ ఆ విధంగా దూరమైనారు. అందుకనే నా అంత నేనుగా ప్రేమించాలనుకుంటున్నాను.

"కవి తినవే! అలా కూర్చున్నావు" అంది సావిత్రి. అప్పటిగ్గాని నాకు భోజనం చేస్తున్నానని గుర్తుకు రాలేదు. ఈ మధ్య అనుకోకుండా నా మనసు ఆలోచనలో కెళ్తుంది.

భోజనాల పిదప 'ఆఫీసు కెళ్తున్నానమ్మా' అనేసి వెళ్లిపోయాడు సావిత్రి అన్న.

చాలాసేపటి వరకు ఏవేవో మాట్లాడుకున్నాం. వాళ్లమ్మగారు పనంతా చూసుకుని పడుకున్నారు.

"కొంచెంసేపు పడుకోవే ..." అంటూ నవారు మంచం పరచి పక్కేసింది. సావిత్రి మాట్లాడుతూనే నిద్రలో జారింది.

మధ్యాహ్నం పడుకోవటం దానికలవాటు గాబోలు! నాకూ చిన్నప్పుడెప్పుడో ఉండేది. ఇప్పుడు లేదు. అందుకే నిద్ర రాక ఆనాటి పేపర్ తిరగేస్తూ కూర్చున్నాను. అలా ఏవేవో ఆలోచిస్తూ కూర్చుండి పోయాను. నాలుగింటి ప్రాంతాన సావిత్రీ వాళ్లమ్మ నిద్ర లేచారు.

"నీళ్ళు పెట్టనామ్మా! స్నానం చేద్దువుగాని ..."

"ఎందుకులెండి చన్నీళ్ళు చాలూ..."

"మొహమాటం అక్కర్లేదమ్మా! నాకు నువ్వూ సావిత్రిలో సమానం" అనేసి నీళ్ళు కాగపెట్టింది.

నేను స్నానం చేసేలోగా సావిత్రి లేచింది అది కూడా ముస్తాబైంది.

"సినిమా. కెళ్లాలన్నా ఇది పట్నం కాదుగా. అలా పొలాలవైపెళ్దాం పద" కాఫీ, టిఫిన్ తీసుకున్న పిదప బైలుదేరాం. చల్లని సాయంకాలం వేళ నడుస్తుంటే పిల్లగాలి వీస్తుంది, ఇద్దరం పొలం గట్టున పిచ్చాపాటి మాట్లాడుకుని చీకటిపడే వేళకి ఇల్లు చేరుకున్నాం. అప్పటికి రాధాకృష్ణ ఆఫీసునుండివచ్చి ఉన్నాడు. రాధాకృష్ణంటే సావిత్రి వాళ్లన్న.

ఆ రోజు మాటా మంతీ అయినాక రాత్రి నిద్ర కుపక్రమించారంతా. నేను సావిత్రి పక్కలోనే పడుకున్నా! సావిత్రికి త్వరగా నిద్ర పట్టుంది. నా మనసు ఆలోచిస్తుంది. పొడుగ్గా వున్న రాధాకృష్ణ విగ్రహమే కళ్లముందు కదులుతుంది. ఇన్నాళ్లకు తనకు తానుగా ప్రేమలోకి జారుతుంది. రాధాకృష్ణ భార్యనయే అదృష్టం తనకుందా ఏమో మరి! ఆ విధెలా రాసి ఉన్నాడో! ఏది ఏమైనా తను అతన్ని ప్రేమిస్తుంది. ఎప్పటికో నిద్ర పోయాను.

మా కాలేజీ తెరిచే సమయానికి ఇద్దరం వచ్చేసినా, నాకు మాత్రం ఎందుకో బాధగా వుంది. ఆ ఇంటి కోడలుగా ఉండి పోతే ఎంత హాయిగా ఉండును!

ఇలా వుంటే ఇక చదువు సాగదని ఆలోచించటం మానాను.

రోజులు గడిచిపోతున్నాయి.

ఫైనల్ ఇయర్ ఎగ్జామ్స్ వ్రాశాము. ఆ చివరి రోజు...

"కవీ! నీకో ముఖ్య విషయం చెప్పటం మర్చానే. ఈ నెల 30న మా అన్నయ్య పెళ్ళి" నా గుండె ఝల్లు మన్నది.

రాధాకృష్ణ భార్య కావాలని కలలు కన్నాను. నా అంత నేను ప్రేమించానే గానీ నా ప్రేమను అతనికి వెల్లడి చేయలేదు. పాపం అతనికేం తెలుసు ప్రేమిస్తున్న విషయం.

"ఇదుగో వెడ్డింగు కార్డు. పెళ్ళికి తప్పకుండా నిన్ను రమ్మన్నాడే మా అన్నయ్య" అందిస్తూ అంది.

"అలాగే" కార్డు అందుకుంటూ అన్నాను.

సామాను సర్దుకుని ఇంటి కొచ్చేశాను మర్నాడు. ఇంటికొచ్చేసరికి అక్కా బావ వచ్చి ఉన్నారు. అక్కయ్య పురుడు పోసుకుందుకు వచ్చిందన్నది అమ్మ.

"ఎలా వ్రాశావు?"

"ఫర్వాలేదు బావా!"

"ఊఁ తర్వాతేం జేయాలను కుంటున్నావు?"

"జాబ్ చూసుకుంటాను."

"ఇంకా జాబ్ ఏమిటే పెళ్లి చేసుకోవూ" లంది అక్కయ్య.

"జాబ్ చేయాలనే చదివాను స్తోమత లేక భరత, సరితల చదువాగి పోయింది. ముందు వారి పెళ్లిళ్లు చేయాలి."

"అదేమిటే లలా అంటావు నీకు చేయకుండా వాళ్లకెందుకు చేస్తామే" అంది అమ్మ.

"నాకు పెళ్ళొద్దమ్మా" గతం తల్చుకుంటూ అన్నాను.

"ఒద్దన్నంత మాత్రాన ఊరుకుంటామే"

"లేకపోతే బలవంతాన ఉరితాడేస్తారా" విసుగ్గా అనేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయాను.

రాధాకృష్ణ పెళ్లి కెళ్లాలను కున్నాను. కానీ ఇంతలో లక్క కాన్పైంది. మగపిల్లవాడు పుట్టాడు. "కంగ్రాట్యులేషన్స్ బావా! అబ్బాయిని కొట్టేశావ్. పెద్ద పార్టీ ఇవ్వాలి" నవ్వుతూ అన్నాను.

"ఇస్తానుగానీ కవితా నువ్వు పెళ్లెందుకు చేసుకోనంటున్నావూ" సీరియస్‌గా మొగాం పెట్టి అడిగాడు

"బావా ఎందుకు మీరంతా ఇలా నిలదీస్తారు కారణమంటూ లేదు బావా. నాకెందుకో వివాహజీవితమంటే అసహ్యంగా ఉంది. ఇంకెప్పుడూ పెళ్లి గురించి అడక్క..." లనేసి చాటుగా కన్నీరు తుడుచుకున్నాను

"నువ్వెక్కడున్నా, ఎలా వున్నా ఈ అన్న ఉన్నాడని, ఈ అన్నను చూడాలని మాత్రం

## పూ ్కాని డైరీ

మర్చిపోకమ్మా" రామకృష్ణ మాటలు జ్ఞప్తికొచ్చాయి. ఆనాటి నుంచి వాళ్ల దాంపత్య జీవితం బాగానే ఉంది. వాళ్లకో బాబు కూడా ఉన్నాడు చూసి చాలా రోజులయిందనుకుంటూ వెళ్ళాను హాల్లో సునీత రామకృష్ణల మధ్య బాబు ఆడుకుంటున్నాడు నా కేంలో ముచ్చటేసింది వారిని చూస్తే.

"ఏమ్మా ఇప్పటికి గుర్తొచ్చామా!" అంది సునీత

"పోన్లే ఇప్పటికైనా గుర్తొచ్చినందుకు సంతోషించాలి" అన్నాడు రామకృష్ణ.

"అది కాదన్నయ్యా... పరీక్షలు"

"ఎలా వ్రాశావు? నేను బాగా నే వ్రాశాను."

"నేను కూడా..."

"దీని తర్వాత ఏం చేస్తావమ్మా ఎక్కడున్నా నీకు మంచి సంబంధం చూడాలనుకుంటున్నాను."

ఆ ప్రసంగం ఇక్కడగూడా వచ్చినందుకు నాకు మహా విసుగనిపించింది

"నేను పెళ్లి చేసుకోను ఇలాగే వుండాలనుంది"

"అదేం" భార్యా భర్త లిద్దరూ ఒకేసారడిగారు

"కారణం ఏమీ లేదన్నయ్యా... నాకెందుకో ఇలాగే వుండాలనుంది ఉద్యోగం చేసుకుంటూ."

"ఆడదానికి జీవితంలో మగవాని చెంత ఎంతో అవసరం కవితా" అంది.

"మీరంతా ఉండగా ఇంకా నాకేం కావాలే."

"ఆ బంధాలు పుట్టింట్లో ఉన్నంత వరకేనమ్మా"

"దయచేసి అన్నయ్యా పెళ్లి మాట ఎత్తకు. నన్నిలా ప్రశాంతంగా, ఒంటరిగా ఉండనివ్వండి" అంటూ బాబు నెత్తుకుని వాడి చేతుల్లో చాక్‌లెట్స్ పెట్టాను

"నీ ఉద్దేశం మా కెవ్వరికీ నచ్చకున్నది కవితా" అన్నాడు.

"నాకు నచ్చిందన్నయ్యా"

"మనం ఏదైనా చేస్తే అది నలుగురికీ నచ్చేలా ఉండాలమ్మా"

"నలుగురితో నా కసవసరం. ఇది నా స్వంత విషయం."

"కవితా! నా మాట వినవా?"

"క్షమించన్నయ్యా... నా కెందుకో పెళ్లంటే బాధగా, భయంగా ఉంది. దాని గురించి తలచుకోవాలన్నా నాకే తెలియని బలహీనత ఏదో నన్ను పీడిస్తుంది ... ఇప్పట్లో పెళ్లి జరగాలని నా రాతలో రాసి లేదేమో! రాసి ఉంటే ఎలాగూ తప్పదు. ఆ రోజు రాక మానదు. సునీ కాఫీ ఇవ్వూ" అన్నాను. వెంటనే అక్కడ్నుంచి వెళ్లిపోయింది సునీత.

"కవితా నువ్వెందుకిలా ఉన్నావు...గతం నిన్ను బాధిస్తుందా!"

"ఛ ... ఆ విషయాలేనాడో మర్చాన్నయ్యా" ఇంతలో సునీత పిలిస్తే లోపలి కెళ్లాను

ఈ సారి నేను ఫస్టుక్లాసులో పాసైనాను. మార్కుల కోసం కాలేజి కెళ్లాను.

"సారీ సావిత్రి. వెడ్డింగుకు రాలేకపోయాను. గ్రీటింగ్ అందిందా!" లనడిగాను.

"నువ్వు రాలేదని అన్నయ్యెంత బాధపడ్డాడో. అన్నయ్యకు నేనెంతో నువ్వూ అంతే. నీకు ఫస్ట్‌క్లాసొస్తే నాకన్నా ముందు అమ్మా, అన్నయ్యా సంతోషించారు." ఈ మాటలు విని గట్టిగా నిట్టూర్చాను.

"ఇప్పుడైనా రావే!"

"సారీనే... వీలుకాదు. చాలా పనుంది. ఏదైనా జాబ్‌కోసం ప్రయత్నించాలి. ఒదిన గారికి నా నమస్కారమని చెప్పు" అనేసి వచ్చేశాను.



## పూర్తికాని డైరీ

ప్రయత్నించగా గరల్స్ హైస్కూల్లో జాబ్ దొరికింది. రోజులు మామూలుగా గడుస్తున్నాయి. నా జీతం ఇంట్లో ఇవ్వకుండా బ్యాంకులో వేసేదాన్ని, ఆ డబ్బు కూడబెట్టి మా సరితకు మంచి సంబంధం చూశాను. నా పెళ్ళి కాకుండానే దానిపెళ్ళా అంటూ బాధపడ్డారు అమ్మా నాన్న. నాన్నను సముదాయించాను. సరిత పెళ్ళి జరిగిపోయింది. ఇక భరత ఉంది. ఎప్పటి డబ్బు అప్పుడు భరతపేర బ్యాంకులో వేస్తున్నాను.

ఓ రోజు వర్షంలో తడుస్తూ స్కూలు నుండి ఇంటి కొచ్చాను. మర్నాడు ఒకటే జ్వరం అయినా అలాగే లెక్కచేయకుండా బడికెళ్తూ వారం రోజులు నెట్టినా అది వదలనంది. ఆసుపత్రి కొచ్చాను. నీతో పరిచయమైంది. మీ ఇంటికొచ్చిన రోజు మీ అన్నయ్యతో పరిచయం కలిగింది. నీలాంటి డాక్టరు నా మిత్రురాలవటం నా అదృష్టంగా భావించుకుంటున్నాను. ఆ రోజు మీ యింటికొస్తే నీవు ఆసుపత్రి కెళ్ళావన్నారు మీ అన్నయ్య.

"కూర్చోండి."

"థ్యాంక్స్."

చాలా క్షణాలు మౌనంగా జరిగాయి.

"మిమ్మల్నొక టడగనాండి."

"ఏమిటండీ?"

"మరేం కాదు... నన్ను వివాహం చేసు కొంటారా ?"

అనుకోకుండా ఎదురైన ఈ ప్రశ్నకు తెల్లబోయాను.

"మానాన్నతో మాట్లాడుకోండి" అనేసి లేచాను వెళ్ళేందుగ్గాను. ఈ సారి నే నెవర్నీ ప్రేమించ కూడదను కున్నాను. కానీ మీ అన్నయ్య మాటలతో నాలో ఏవో ఆశలు కలిగాయి.

"రేపు మా అనిత పుట్టినరోజు"

"అలాగా ... వస్తాను" అనేసి ఇంటి కొచ్చేశాను. ఆ తర్వాత... ఆ తర్వాత ఇక ఆ డైరీలో యిక వ్రాసిలేదు. ఇంతసేపు కవిత తనతో మాట్లాడుతున్నట్టే అనిపించింది. చదువుకుని ఏడుస్తుండగ రమేష్ వచ్చాడు.

"అన్నయ్యా కవిత తన డైరీ చదువు

కొమ్మని ఇచ్చింది. పూర్తికాని డైరీ అది. ఇంకా పేజీలు మిగిలిఉన్నా దాని ఉపయోగం మాత్రం పూర్తి అయింది... ఏ కలందు ఒక రూపం ఏర్పడకనే కవిత వెళ్ళిపోయిం దన్నయ్యా. నిజంగా దానిది కన్నీటి గాధే. అది జీవితంలో ఏ నాడూ ఏ సుఖానికి నోచుకోలేని దురదృష్టవంతురాలు ..." అంటూ ఏడుస్తున్న చెల్లెల్ని సముదాయించ లేక డైరీ నందుకుని గబ గబ పేజీలు తిరగేశాడు రమేష్ !... కాని చినిగిపోయిన డైరీ శిథిలమైపోయిన జీవితానికి ప్రతిబింబం అది...

# చీకటిచిమ్మేదీపం

## జి. నరసింహమూర్తి




ఇప్పటినుంచి కాదు. అప్పుడే ఆరు నెలల నుంచి ఆ పై అంతస్తులో వో స్ప్రింగ్ ఛైర్ రాత్రయ్యేసరికి వూగుతోంది.

ఆ ఛైరేకాదు. అందులో కూర్చునే ప్రభాకర్‌కూడా దాంతోపాటే ఊగుతున్నాడు.

ఛైర్ ఆగింది.

గ్లాసులోకి మరోకాస్త ఫారన్ లిక్కరు వలికింది

దాన్నలాగే నాలుగు గుక్కల్లో మింగేవాడు. కాని ఆ లిక్కర్ మాత్రం ఎంతకి అతన్ని మింగలేకపోతుంది.

గట్టిగా ఊపిరి పీల్చాడు. మళ్లీ అక్కడికే చూసాడు. అవి చూడకూడ దనుకునే చోటులోకే వెళ్లి పడుతున్నాయి. ఆ లైటు స్తంభం కింద కూర్చున్న అబ్బాయి మీదే పడుతున్నాయి.

ఆ గదిలో ప్రభాకర్ కూర్చోడంతప్పుడు. లాన్ ప్రహరీ పక్కనుంచే వెళ్లిపోతున్న రోడ్డుకి అవతలవేపునున్న ఎలక్ట్రిక్ లైటు స్తంభం అతని కళ్లల్లోంచి తప్పుకోదు. అది తప్పుకోకపోయినా అదేమీ పట్టించుకోకపోయునుగాని ధానికింద ఎవరో కుర్రాడు వచ్చి కూర్చుంటాడు బాల యోగిలా. చలి తనని కొరుక్కు తింటున్నా ఆ పుస్తకాన్ని తింటూనే కూర్చుంటాడు.

అదీ అతని బాధ !—

వదు — అలా చూడకూడదు. చూడవవసరంలేదని లెక్కలేనన్నిసార్లు అనుకొని ఉంటాడు. కాని సాధ్యం కాలేదు.

కిటికి తలుపులు మూసుకున్నా మనో నేత్రం మూసుకోలేదు. శరీరాన్ని దూరంగా ఉంచుకోవాలన్నా హృదయాన్ని బంధించ లేదు.

రోడ్డు. రోడ్డుమీద లైటు స్తంభం, రోడ్డు దిగితే గుడిసెలు. పెరిగే చెత్తగుట్టల్లాంటి గుడిసెలు!— ఇవతల ప్రభాకర్ అంతస్తుల మేడ.

అంతస్థులమేడ ప్రభాకర్ పెంచుకున్న అంతస్థుకి నమూనా కనిపించే ఆగుడిసెల్లు గడచిన రోజుల్ని గుర్తుచేసే .నరకాలు !

*   *   *

తండ్రి తన కొడుక్కి తనలాంటి కష్టాలు రాకూడదని కడుపు మాడ్చుకుని చదివించాడు తల్లి కూలి పనులు చేసింది. అటు తల్లీ— ఇటు తండ్రీ కొడుకు అభివృద్ధికోసం పాటుబడ్డారు.

ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ..

ఇలాగే చదువుల మెట్లెక్కుతూ ముందుకు పోయాడు ప్రభాకర్.

కడుపుకి చాలీచాలని ఆ యింట్లో కిరసనాయిలు దీపం కూడా పత్తులుపడేది. కాలే కడుపులో కష్టాల్ని జీర్ణించుకున్నాడు. అలసిపోయే శరీరంలో ఉత్సాహం పెంచుకున్నాడు. దీక్షతో చదువులో ముందుకు నడిచాడు.

చదువుతో పట్టుదల క్రమేపీ పెరిగిపోయింది. ఆ పట్టుదలే పోటీగుణంలేపింది. ఎదుటివాడికి ఎక్కువ మార్కులొస్తే సహించలేడు. ఎదుటి వాడిని మాష్టారు మెచ్చుకుంటే ఒళ్లు రగిలిపోయినట్లుండేది. మెప్పులూ మార్కులూ తనకే కావాలి. నలుగురూ తనని చూసి ఈర్ష్యపడేటంతటివాడవ్వాలి.

ఇదే కోరిక ప్రభాకర్‌లో కోరలు పెంచుకుంది.

కాని పేదరికం వాటిని విరచడానికి ప్రయత్నిస్తుంది.

ఎముకలు విరిగేటట్టు పనిచేసే తండ్రి!

శ్రమకే బానిసైపోయిన తల్లి!

బాధలు!—బరువులు!

లేములు! రోగాలు!

ఇవన్నీ గాలీ నీరూ, తిండీ బట్టాకంటే పుష్కళంగా ఈ లోకంలో మానవునికి లభించే వరాలుగా దేవుడు సృష్టించినట్టున్నాడు. వీటితో యుద్ధం చేయడానికే పేదవాడికి తీరక దొరక్కపస్తుంటే నన్ను పూజించడంలేదంటూ దేవుడు మనుష్యుల్ని నిరసిస్తూ శపిస్తూంటే ఇంకేదేవుడికి మొరపెట్టుకోవాలి!

సుఖాల్లో, భోగాల్లో ఒళ్ళు మరచి మత్తులో తేలిపోయే భోగలాలసులకు దైవచింతన అవసరం కనబడుతుందా మరి!

ఇవన్నీ చూస్తుంటే ఎదుగుతున్న ప్రభాకర్‌లో నిద్రలేచే ఆలోచనలు — అగ్నికెరటాలు—చైతన్యస్రవంతులు —

ఉన్నవాళ్ళంతా ద్రోహులు. పదిమందిని తోసుకుని ముందుకెళ్ళి ఒకస్థానం సంపాదించి పెట్టుకుంటారు. తర్వాత దగ్గరకెవ్వర్నీ రానివ్వకుండా ఆ స్థానాన్ని కాపాడుకుంటారు.

వీళ్ళని జయించాలి. జయించాలంటే పెద్దవాడవ్వాలి. చదవాలి. పెద్దఉద్యోగం సంపాదించాలి. అంతకంటే ఎక్కువడబ్బు సంపాదించాలి. తనలాటి పేదపిల్లల్ని ఆదుకోవాలి. చిన్నచూపు చూడబడుతున్న తనలాటి పేదల్ని అర్థంచేసుకోవాలి. ప్రేమించాలి.

చదువుకోవాలనే కోరికలోన భగభగమండుతున్నా ఎంతపేర్చినా తడిఅందని కిరసనాయిలుదీపం అలసి, ఆయాసంతో ఆ వేళకి కళ్ళుమూసుకొనేది. తక్షణం ప్రపంచంలో ఉన్న చీకటంతా పొంగుకొచ్చేది ఆ పూరింట్లోకి.

ప్రభాకర్ వెళ్ళి ఎలక్ట్రిక్‌లైటుస్తంభం కింద చదువుతూ కూర్చుంటాడు. రాత్రి ఏ ఒంటిగంటవరకో చదువుతాడు.

ఈ గతులన్నీదాటి చదువులో ముందుకెళ్ళాడు ప్రభాకర్. సముద్రంలాటి చదువును మరింతశక్తితో ఈదడం ప్రారంభించాడు. అవతలవేపుకి చేరేసరికి ఇంజనీరింగుపట్టా చేతికొచ్చింది.

మట్టిలో మాణిక్యం అన్నారు.

పట్టుదలగల మనిషన్నారు.

కార్యదీక్షా పరాయణుడన్నారు.

ప్రభుత్వం ఇచ్చిన స్కాలర్‌షిప్ ప్రభావం అన్నారు.

మనసుందికనుక మార్గం వెదుక్కున్నాడన్నారు.

లైటుస్తంభంకింద చదువుకునే సామాన్యుడు ఇంజనీరింగుపాసయి కేంద్ర ప్రభుత్వ సివిల్ ఇంజనీరింగ్ డిపార్టుమెంటులో ఉద్యోగయ్యాడు.

ప్రభాకర్ మూడోసంవత్సరం ఇంజనీరింగ్ పరీక్షల్లో ఉండగా తల్లిపోయినట్టు టెలిగ్రాం వచ్చింది అదిచూసి తొణకలేదు తనకు చదువుముఖ్యం పరీక్షలు రాయాలి. పాసవ్వాలి. కాని చనిపోయిన వారితో చనిపోలేడు. తనది రాతిగుండె.

చుట్టూ బాధలు. ఆర్థిక సమస్యలు. ఆదుకునేవాళ్ళులేరు. వాళ్ళను ఉద్ధరించే వాళ్ళులేరు. ప్రభుత్వాలు పేదలకోసమే నంటూ వస్తాయి. తర్వాత పదవులకోసం ముఠాబలంకోసం తన్నుకులాడి, దెబ్బలాడి, చీలిపోయి తమస్వలాభాలు తీర్చుకుంటాయి సహించలేక ప్రజలు ఎదుర్కొంటారు. ప్రభుత్వం పడిపోతుంది.కొత్తది వస్తుంది. కాని పేదవాడి సమస్యలుమాత్రం పెరుగుతూనే ఉంటాయి.

చుట్టూ లంచాలు! కక్షలు, నిరుద్యోగులు, నివాసప్రదేశాలు మురికిగుంటలమయం. దోమలూ, రోగాలూ ఆకలిచావులూ—పైకి రావాలనుకునే లక్షలాది యువకులు నిస్పృహా నిరాశల్లో కొట్టులాటలు!

వీటినన్నిటినీ ఎదుర్కోవాలను కున్నాడు ప్రభాకర్. కాలేజీ మీటింగుల్లో పదునైన భావాల్ని వ్యక్తం చేసాడు. తన ఆశయాల్ని నెరవేర్చు కుంటానని సవాలు చేసాడు. దేశంలో జరుగుతున్న అన్యాయాలను రూపుమాపుతానన్నాడు తనో ఆదర్శ జీవిగా బతకడానికి రేయింబవళ్ళు కృషి చేసి పైకి వచ్చాడు.

కాని పైకొచ్చిన తర్వాత కింద జరుగుతున్నది చూసే సమయంగాని, ఓర్పుగాని లేకుండా పోయాయి.

ఈ హోదా, అధికారం, అంతస్థూ పెంచుకోడానికి మరో యజ్ఞం ప్రారంభించాడు.

గతం గుర్తు తెచ్చుకోవడం కన్నా భవిష్యత్తు కోసం ముందుకు దూసుకుపోవడం కోసం శ్రమపడుతున్నాడు.

ఒక్కనెలలో ఆఫీసు రూపాన్నే మార్చేశాడు. కింద ఉద్యోగుల్ని సాధించైనా అనుకున్న పని గంటల్లో, నిముషాల్లో చేయించాడు. తానూ చేసాడు. కొత్త ఇంజనీరయినా పాత ఇంజనీర్లను తోసుకుని ముందుకెళ్ళాడు.



'పేంథర్' [ కొండచిలువ ] ఇది ప్రభాకర్‌కి కొందరు పెట్టిన మారుపేరు. అప్పట్నుంచీ ప్రభాకర్ పేంథరయ్యాడు. పేంథర్ ప్రభాకర్‌గా అందర్నీ హడలగొట్టడం కూడా నేర్చుకున్నాడు. అతన్ని చూస్తేనే క్రింద ఉద్యోగులకు భయంగా ఉండేది.

చాకచక్యం గలవాడు కనుక ప్రమోషన్ పెందలాడే సంపాదించేశాడు. దాంతోపాటు ట్రాన్స్‌ఫర్ కూడా వచ్చింది. అక్కడకెళ్ళి ఆఫీసు డ్యూటీలో జాయిన్ కాకపోతే మరో సీనియర్ని ఎపాయింట్ చేయడానికి చూస్తున్నారు. అదేసమయంలో తండ్రి పోయినట్టు టెలిగ్రాం వచ్చింది. ఆ వార్తకి అతని హృదయం కరగలేదు–విరగలేదు.

చచ్చిపోయిన తండ్రి రాడు. కాని రాబోతున్న హోదా చేయిదాటితే సోపానం ఎక్కలేడు. ఇదే అతని బాధ.

ఎదురు చూస్తున్న హోదా కళ్ళముందు అందంగా కదిలింది. మనిషికి కావలసిందీ రోజుల్లో ఏమిటి?— హోదా— అంతస్తు— ధనం— అంతే లోలోన ఎండినసవ్వు పెదిలింది ఇక తనకా పాత జ్ఞాపకాలు అనవసరం, వాటిని త్రుంచి దూరంగా విసిరేశాడు, తిన్నగా ట్రాన్స్‌ఫర్ వచ్చినచోటికి వెళ్ళిపోయాడు.

తనచుట్టూ కొత్తలోకాన్ని సృష్టించుకున్నాడు. కార్లూ, పార్టీలూ, క్లబ్బులూ, పెద్దపెద్ద ఆఫీసర్లూ పెరిగిపోతున్నారు. తక్కువవాళ్ళతో కలిసిపుంటే తనని కూడా ఆజాతిలో పురుగే అంటారేమోనన్న సంకోచం. పేదరికమంటే అసహ్యం.

దీనిని జయించడానికి చేయవలసినవన్నీ చేసాడు ప్రభాకర్. పనికట్టుకు ప్రేమించాడు వో కర్నల్ కూతుర్ని. సాధించాడు. అలాగే పెళ్ళాడాడు. అనుకోవాలేగాని జరిగిందాకా వదలడు;

పెద్ద పెద్ద కంట్రాక్టుల్లో తక్కిన వాళ్ళతో లాలూచీ అయి నాలుగు లక్షలు కొట్టాడు. తన మామగారైన కర్నల్ పేరుమీద కారు కొన్నాడు. భార్య పేరమీద వో మేడ కొన్నాడు.

తానోమేడ సంపాదించాడు గాని తాను కట్టించినవి కూలిపోయినందుకు విచారించలేదు. తన లోవ పొడుగునా తివాసీలు పరచుకున్నాడుగాని తాను వేయించిన రోడ్ల మీద అప్పుడే లరగజం గోతులు పడినందుకు బాధపడలేదు,

ఏది ఎలా ధ్వంసమయిపోయినా తన గతం మాత్రం గుర్తుకు రాకూడదు. తన గత చరిత్ర కదిపేశక్తి వేటికీ ఉండకూడదు. తను వెలిగించుకున్న దీపాలు తనకే కావాలి! తను కట్టుకున్న అంతస్థుల్ని భద్రపరచుకోవాలి. తను సాధించిన హోదాలు తనకు

# ఇతర ఆస్‌బెస్టాస్ సిమెంటు షీట్లు ISI వారి గుణపరీక్షలలో నెగ్గవచ్చును.

# అయితే, RSI* తో సరిపోల్చలేవు.








ఐ.ఎస్.ఐ. పరిశోధనలతో పోల్చిచూడగా, రామ్కో సాధనలు : భారాన్ని నిర్వహించే శక్తి 40% ఎక్కువ; చిత్తడిని పీల్చుటలో 20% తక్కువ; ఆమ్లముతో గూడిన నీటిని ప్రతిఘటించుటలో 20% అధిక శక్తి.

రామ్కోను ఉపయోగించే కాంట్రాక్టర్లను సంప్రతించండి. వారు దృఢత్వానికి, చిరకాల మన్నికకు రామ్కోను సిఫార్సు చేయగలరు. రామ్కోయొక్క శక్తి కాలంతోపాటు వృద్ధిచెందునే కాని క్షీణింపదు. రామ్కోయొక్క సహజమైన ఈ ఉత్తమ గుణమును పలువురు అభినందింపగలరు.

గుణమే ప్రధానముగా నెంచు మా ఫ్యాక్టరీలలో తరములో కొంచెము తక్కువైనను ఆ షీట్లకు స్థానము లేదు. ఆర్.ఎస్.ఐ. పరీక్షకు సాటిరాని వాటిని మేమే నిరభ్యంతరముగా నిరాకరించెదము, సాటిలేని మేటియైన రామ్కో భారతదేశములోని భారీ పరిశ్రమలచే ఉపయోగింపబడుచున్నది. పాశ్చాత్య దేశములలో, ముఖ్యముగా అరబ్బు దేశములలో రామ్కో మిక్కిలి ప్రబలమైయున్నది. కావున ఆలోచించి నిర్ణయించండి రామ్కో ఒక సాధారణమైన అస్‌బెస్టాస్ సిమెంటు షీటు కాదని

**Ramco** ఆస్‌బెస్టాస్ సిమెంటు షీట్లు, మరియు ఇతర ఉపకరణములు



**మదర్స్ ఆస్‌బెస్టాస్ సిమెంటు లిమిటెడ్**
150A/2, అణ్ణాశాలై, మద్రాసు-600 002.
బ్రాంచీలు : బెంగుళూరు, కొచ్చిను, విజయవాడ, హైద్రాబాదు.
ఫ్యాక్టరీ : అరక్కోణం (తమిళనాడు) కరూరు (కర్నాటకము)
సంపూర్ణ వినియోగదార్లు : రాజా ధర్మస్థాపనము

ACIL SAC 2 78

## చీకటిచివ్వే దీపం

మరింత హోదాతెచ్చిపెట్టాలి. దాని కంత రాయంగా ఏమొచ్చినా దానిని తొలగించెయ్యాలి అంతే-

*   *   *

ప్రభాకర్ ఇన్నినెలలుగా ఎందుకో ఓర్చుకుంటున్నాడు. కాని ఇంక ఓర్చుకునేదిలేదు— దీనికి పరిష్కారమార్గం కూడా చాలా సులువు.

ఒకటీ—రెండగా—మూడు—

అప్పుడే మూడ్రోజులు గడిచాయి.

ఎవర్నో ఒకర్ని తీసెయ్యాలి.

ఒకటి కుర్రోడు రెండు దీపం.

చీకటిపడింది. యధారీతిగా ఆ ఎలక్ట్రిక్ స్తంభంకింద కూర్చుని చదువుకునేకుర్రోడు వచ్చాడు. ఆ రోజుల్లో తానూఅంతే. అలాగే స్తంభందగ్గరకి వచ్చేవాడు. ఆ రోజులు కళ్ళముందు కనబడుతుంటే భరించలేక పోతుంది తనమనస్సు. ఇప్పటివరకూ అవన్నీ తనను వేటాడాయి. ఇక తాను వాటిని వేటాడాలి. అంతే—

అఖరిరోజు. సమస్యను సమాధిచేసే రోజు. తుపాకితీసాడు. అది జంతువుల్ని వేటాడేది. 'ఆత్మల్నీ, మానవత్వ విలువల్నీ కూడా వేటాడగలిగే బలం సంపాదించింది నేడు.

అందులో ఒకేఒక్కగుండు లోడ్‌చేసాడు. ఒక్కటిచాలు తాను చెయ్యాలనుకున్నపనికి. ఎన్నడూ గురితప్పలేదు.

రాత్రి పదయింది చలిలోకూడా దీక్షగా చదువుతున్నాడు ఆ స్తంభంకింద కుర్రోడు.

ఆనాడు తానూ అంతే-అలాగే చదివి చదివి రాత్రి ఎప్పటికో తన పూరింటికెళ్ళి చిరిగిన గొంగళ్లో వణుకుతూ పడుకునే వాడు.

ఛీ!— అది ఇక ఎన్నడూ గుర్తుకు రాకూడదు.

సమయంకోసం ఎదురుచూస్తున్నాడు.

పది— పదకొండు— పన్నెండు— ఒకటి.

రాత్రి ఒంటిగంట.

ఆ కుర్రోడు లేచాడు.

ఉక్రోషంగా ప్రభాకర్‌కూడా స్ప్రింగ్ కుర్చీలోంచి లేచాడు.

ఎర్రబడ్డ కళ్ళు ఎలక్ట్రిక్ దీపాన్నీ, ఆ

## "గుల్ పాపట్‌లు"

కావలసిన వస్తువులు : గోధుమలు — అరకిలో. ఎండు కొబ్బరికాయ — ఒకటి, బెల్లం— ఒక కిలో, యాలకులు— 15, నెయ్యి— పావుకిలో.

తయారు చేయుట: మొదట గోధుమలు శుభ్రంచేసి పేలాలుగా వేయించాలి, వేగిన తరువాత, ఆ పేలాలను తిరగలిలో వేసి విసరాలి. మరీ పిండిగాను, మరీ మొరుంగానూ కాకుండా విసరాలి. ఈ పిండిలో కొంచెం నీళ్లు చిలకరించి నాననివ్వాలి. నీళ్లు ఎక్కువగా పోయకూడదు. చేతితో కలిపితే పిండి పిండిగా విడిపోయేట్టు ఉండాలి.

తరువాత, తెల్లబెల్లం అయితే బావుంటుంది. ఈ బెల్లాన్ని మెత్తగా పొడి చెయ్యాలి. ఒక పాత్రలో బెలం, నీళ్ళూ, కలిపి పాకం పట్టాలి. తీగపాకం రావాలి. పాకం వచ్చేలోపల ఎండుకొబ్బరి కోరుకుని, యాలకులు పొడి చేసుకుని ఉంచుకోవాలి.

బెల్లం పాకంరాగానే, గోధుమపిండిని వేసి బాగా కలుపుతూండాలి. అందులోనే కొబ్బరి, నెయ్యి, యాలకులపొడి కూడా వేసి, బాగా కలుపుతూండాలి. ముద్దగా అయినాక, క్రిందకు దింపి, చల్లారకుండానే, పళ్లానికి నెయ్యిరాసి, అందులో ఈ ముద్దను వేసి, బిళ్లలు బిళ్లలుగా కోసుకోవాలి. యివి చాలా కాలం, సుమారు నెలా రెండు నెల దాకా చెక్కుచెదరకుండా కరకరలాడుతూ చక్కగా నిలవుంటాయి ఈ "గుల్ పాపట్‌లు."

— జి. రామలక్ష్మి

కుర్రోడ్ని మార్చి మార్చి చూసాయి.అతనిలో అహం అధికారం చేస్తోంది. తన దీపం వెలగాలి. తన బతుకు హాయిగా వుండాలి. తక్కినవన్నీ ఆరిపోవాలి. నాశనం కావాలి.

సరిచూసాడు. పైన దీపం. కింద కుర్రోడు. బారెల్ కిందికీ పైకీ ఊగుతోంది ఒకే ఒక్క గుండు.

గట్టిగా ఊపిరి పీల్చుకుని సరి చూసి ట్రిగ్గర్ నొక్కాడు.

ఆ స్తంభంచుట్టూ చీకటి కమ్మింది.




# ఘాలాక్షని డైరీ

## "మూడో ప్రపంచం"

మన భారతదేశం, చైనా పాకిస్తాన్‌ను పశ్చిమ దేశాలు "మూడో ప్రపంచంగా ప్రపంచం భావిస్తుందట, అమెరికా, అమెరికా దేశాలను మొదటి ప్రపంచంగా, రష్యా, రష్యా దేశాలను రెండో ప్రపంచంగా ప్రపంచం భావిస్తున్నదట. మనకి రెండు ప్రమోషన్లు రావాలన్నమాట అఖిల ప్రపంచ దృష్టిలో.

## జీవకారుణ్యంపేర శిశు హత్యలు

వెన్నెముక సరిలేక, ఇక బతికరు అనే స్థితిలో పుట్టిన పిల్లలు ఇంగ్లాండులో సుమారు ఏటికి అయిదొందలమందైనా జీవకారుణ్యం పేర హత్య చేయబడుతున్నారట,

## అందంలో పైచెయ్యి

ప్రపంచంలో వున్న అన్ని దేశాల, సంస్థల విమానాలలోని ఎయిర్ హోస్టెస్‌లలో భారత దేశంలోని భారత విమానాలలో స్త్రీలు మిక్కిలి అందంగా వుంటారని, వున్నారని కుష్వంత్ సింగ్ అన్నారట. ఆయన ప్రపంచంలోని అన్ని దేశపు విమానాలలోనూ ప్రయాణం చేశారట!

## కటిక నేలపై నిద్రించే రాజ్‌కపూర్

ప్రఖ్యాతనటుడు, నిర్మాత, దర్శకుడు, రాజకపూరు పట్టి నేలమీదనే పడుకుని నిద్రపోతారట ఆయనకు పరుపులు, కుషనులు, మంచాలు వంటివేవీ అక్కరలేదట. నేలమీద చెయ్యి తలదిండుగా పెట్టుకుని ఆయన నిద్రపోతారట!

## కాయకష్టంచేస్తేనే కాలేజి చదువు!

చైనాలో హైస్కూలు చదువు ముగిసిన తర్వాత వెంటనే కాలేజీలో చేర్చుకోరట. హైస్కూలు ప్రతి వ్యక్తి మూడు సంవత్సరాలు కాయకష్టం చేసి సంపాదించి, ఆనక కాలేజీలో చేరాలట. మూడేళ్ళు శ్రమజీవిగా ధనార్జన చేసినట్లు నిరూపించుకుంటేనే కాలేజీలో సీటట!

## మొసళ్ళ దొంగలు!

మలేషియాలోని జోహర్‌బార్ అనే వూరిలో దొంగలుపడి ఆవూరు పక్కనున్న నదిలోని మొసళ్ళనుఎత్తుకుపోతుంటారట. మొన్నీమధ్య దొంగలుపడి, 113 మొసలి పిల్లలను ఎత్తుకుపోయారట.

## నూతిలో పడి పిల్లల మృతి

పేరుక్కూరిచ్చి గ్రామంలోని ఓ ప్రాథమిక పాఠశాలలో చదువుకునే పిల్లలో ఏడుగురు స్కూలు నుంచి యింటికి నడిచివస్తూ, దారిలోని ఓ పొలంలోని నూతిలో అయిలు యింజను శబ్దం విని ఆ చోద్యం చూద్దామని ఆ నూతి పిట్టగోడ పైకి పోయి, పిట్టగోడనానుకుని, తొంగి చూశారట. ఆ పిట్టగోడ గుభిల్లు కూలి, ఏడుగురూ నూతిలో పడిపోయారట. ఈ శబ్దానికి పక్కపొలం వాళ్ళు పరుగున వచ్చి నూతిలో పడ్డవారిని తీస్తే ముగ్గురే బతికారట. ఎనభై అడుగులలోతున్న ఆ నూతిలో నీరు నలభై అడుగులలోతుకున్నదట. చనిపోయిన పిల్లలు ఏడు నుంచి పదేళ్ళలోపు వారట.

## ఇండోనీషియాలో లక్షమంది రాజకీయ ఖైదీలు!

ఇండోనీషియాలో గత పది సంవత్సరాలుగా సుమారు ఒక లక్షమంది రాజకీయ ఖైదీలుగా చెరసాలలో జీవనం చేస్తున్నారట. వీరికి విడుదల అనేదుందో లేదో వారికి తెలియక పోవడమే గాక ఇండోనీషియా క్కూడా తెలీదట. పాపం!

## ప్రేమకు ప్రతిఫలం!

చిన్నసేలం అనే వూరుకు చెందిన 13 ఏళ్ళ అంజలీదేవి అనే అమ్మాయి ఆత్మూరుకు చెందిన దేవరాజ అనే ఓ లారీ క్లీనరుని ప్రేమించి ఒకసారి ఇంట్లోనుంచి బయల్దేరి, తన పుస్తకాలు మధ్యదారిలో పారేసి, అతనితో పారిపోయిందట. ఇద్దరూ ఆత్మూరులో కాపురం పెట్టారట. నాలుగేళ్ళు గడిచాయట. అంజలీదేవి తండ్రి ఎలాగో యీ సంగతి, నివాసం తెలుసుకుని అప్పుడప్పుడు కూతుర్ని చూసిపోతూండేవాడట. దేవరాజ క్లీనరుద్యోగం పోయి, అతని కెక్కడా వుద్యోగం దొరకనందున అంజలీదేవి కూలిపనికి వెళ్ళి సంపాదించ నారంభించిందట. ఇదే బాగున్నదనుకుని దేవరాజ తాగి, జల్సా ఆరంభించాడట. ఓసారిట నీకు న్యాయమా! నిన్ను నమ్ముకుని వచ్చిన నన్నిలా ఏడిపిస్తావా అని భోరున ఏడుస్తూ ఆమె అడిగేసరికి అతనుపై వీరావేశంతో ఆమెనోరునొక్కి చంపేశాడట. చుట్టుపక్కల వాసనొస్తే దొరికిపోతానని శవాన్ని వంటింట్లో పడుకోబెట్టి, సెంటుకొని శవంమీద పోశాడట. అయినా చుట్టుపక్కల వాళ్ళు పసిగట్టేసరికి పారిపోయి, పోలీసులకు దొరికిపోయాడట.

## రెండున్నరకోట్ల నిరుద్యోగులు!

స్వతంత్ర భారతదేశంలో యీనాటి లెక్కల ప్రకారం రెండున్నర కోట్లమంది నిరుద్యోగులుగా ప్రభుత్వ రికార్డులలో వున్నారట. బహుశా యీ 1999 ముగిసేలోగా యీ సంఖ్య అయిదుకోట్లుగా అభివృద్ధి చెందుతుందేమోనని తత్సంబంధ అధికారు లనుకుంటున్నారట. అభివృద్ధి అనగా అన్నీ పెరగడమే కదా లెట్ నిరుద్యోగుల సంఖ్యాలన్నా గ్రా.

## చతురస్రాకారపు టమేటా!

కాలిఫోర్నియాలో కలువతురంగా వుండే టమేటా కాయలు పండిస్తున్నారట. మామూలుగా గుండ్రం [పూర్తి గుండ్రం కాదు] వుండే టమేటాల రుచి, వాసనలోనే యీ కొత్తరకం టమేటాలు కలవిరంగా వుంటాయట. పిటిలొక్క ఒక్క ఫీకరు మందంగా వుంటుందట.

### కరెంట్ కంచె !

తుంకూరు అనే ఊరుకు చెందిన ఒక వ్యవసాయదారుడు తన పొలంలో దొంగతనాలు అరికట్టడానికి పొలం చుట్టూ ఇనుప కంచె కట్టి, ఆ కంచెకి ప్రభుత్వానికి సంబంధించిన ఎలక్ట్రిక్ స్తంభం నుంచి కరెంటు సంగ్రహించి పెట్టాడట. ఈ విషయం తెలియని పొరుగింటివాడు విలాసంగా దానిమీద చెయ్యి వేసి, చనిపోయాడట.

### అమెరికాలో మద్యనిషేధం !

అమెరికాలో కూడా కొన్ని ఊళ్లలో [అరవై] మద్య నిషేధముందట. ఆ ఊళ్లలో పబ్లిక్‌గా మద్యపానాలు పానీయాలు వుండవట. అంతేగా మరి!

### అభినవ కౌటిల్యుడు !

చాణక్యునికి మించిన మేధావులు మన భారతదేశంలో ఈ నాటికీ అనాటికీ సంభవామి పైపులో వుంటూనే ఉన్నారు. ఒక అపర చాణక్యుడు ఊరులో సుందరిని పెళ్ళి చేసుకుని దొరికిన నగలు, నాణ్యాలు అభిమన్యుసినా వేగంగా చెక్కేసి పోయాడట. అతని కోసం పోలీసులు దేవేంద్రులుగా వెయ్యి కళ్ళతో చూడనారంభించారట. అలహాబాదులో, నాగపూరులో, కాన్పూరులో, ఢిల్లీలో, భోపాలులో, శ్రీనగరులో కొందరమ్మాయిల్ని పెళ్ళి చేసుకుని, అంతర్ధానమై నాగపూరులో ఒక సాధారణ రూపంలో సాక్షాత్కరించేసరికి పోలీసువారికనుమానం వచ్చి ఆరాతీస్తే గడ్డం పూడి కొంతకాలం కదలి అతడే యువకుడని తెలిసిందట. అతడేయువకుడైన ఈనాడు ప్రభుత్వాన్ని కూడా మోసగించి కొన్ని లక్షలు కాజేశాడట — ఇదెట్లా! చెప్పాలంటే దాతని వృత్తి రహస్యం ఇదా!

### చట్టాల మార్పులో రికార్డు !

కాంగ్రెసు ప్రభుత్వం 1971 నుంచి 1976 వరకు వున్న కాలంలో ప్రభుత్వ చట్టాలలో 19 మార్పులను చేసిందట. అంతేగాక 464 కొత్త చట్టాలను ప్రవేశపెట్టిందట. 96 అత్యవసర చట్టాలను రూపొందించిందట. 36,515 బుల్లి బుల్లి చట్టాలను రూపొందించిందట — వాటేవో

### హోమ్‌వర్క్ చెయ్యలేక ఆత్మహత్యలు

స్కూళ్లలో ఇచ్చే హోమ్‌వర్క్ ఇళ్ళల్లో పూర్తి చేసుకోడానికి సమయం లేక, పూర్తిచేయలేక తద్వారా మనస్సు పాడై, జీవితమే అసహ్యమనిపించి జపాన్‌లో ఐదుమొదలు పదమూడేళ్లలోపు వుండే పిల్లలు పోయిన ఏడు మూడువందల మంది ఆత్మహత్య చేసుకున్నారట — ఇదే మనదేశంలో అయితే ......పుల్‌స్టాప్!

### మానసిక రోగులకి రెట్టింపు వైద్యుల ఆత్మహత్య

అమెరికాలో మనస్సు బాగులేక, జీవితంమీద విరక్తి చెంది, ఆత్మహత్యలు చేసే వారికి సేవ చేసే మనస్తత్వ శాస్త్ర డాక్టర్లు రెట్టింపు ఆత్మహత్య చేసుకుంటున్నారని అక్కడి ఒక సంబంధశాఖ అన్నదట !

# వారఫలం

మహేష్

17-2-1978 శుక్రవారం మొదలు
23-2-1978 గురువారం వరకు

**మేషం:—** ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**వృషభం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీదారి పోటీ ఎక్కువుంది. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మనస్సుకు బాధ్యత కలిగించే వాగ్దానాలు చేయడం తగదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**మిధునం:—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో ప్రయాస కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీ విలువైన వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**తుల:—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభించగలదు.

**వృశ్చికం:—** శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో అనుకూలమైన వర్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ కంటె పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు:—** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:—** పోటీవారితో వాదప్రతివాదాలు లగవు. వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:—** ప్రయాణాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు — బంధువులకు సహాయం చేస్తారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

## కంచన్‌బాగ్ కేంద్రీయ విద్యాలయం :

కంచన్‌బాగ్ కేంద్రీయ విద్యాలయం ఉపాధ్యాయ, పోషక దినోత్సవంలో డి. ఆర్. డి. ఎల్. డైరెక్టర్ డాక్టర్ అరుణాచలం అధ్యాపకులు తలిదండ్రులందరూ మననం చేసుకోవలసినవి. కళాశాలలోను, విద్యాలయాలలోను పాఠ్యాంశాలు పెరుగుతున్నాయి. విజ్ఞాన భండారం క్షణక్షణం అభివృద్ధి చెందుతున్నది. కనుక విద్యాలయాలు, తలిదండ్రులు సన్నిహిత సంబంధంతో మెలగాలి అని ఆయన అన్నారు. ఈ విశ్వవిద్యాలయం విద్యార్థుల తలిదండ్రులు విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడాలని ఆయన అన్నారు. కేంద్రీయ విద్యాలయాల బొంబాయి ప్రాంతీయ అసిస్టెంటు కమిషనర్ శ్రీ ఎస్. రామచంద్రన్ విద్యాలయం ప్రగతిని ప్రశంసించారు. విద్యాలయం ప్రిన్సిపాలు శ్రీ వడలి మందేశ్వరరావు విద్యాలయం ప్రగతిని, భవిష్యత్పథకాలను వివరించారు. శ్రీ అడివి. రామారావు పోషకోపాధ్యాయ సంఘం అధ్యక్షుడు శ్రీ అడవి రామారావు విద్యాలయ ప్రగతిని ప్రశంసించారు. శ్రీమతి అరుణాచలం బహుమతిప్రధానం చేశారు. సమావేశం ప్రారంభంలో దేవరాజ శర్మ స్వాగతం చెప్పగా, శ్రీ పి. వి. ఆర్. శర్మ సమావేశం చివర సంస్కృతంలో అభినందనాలు తెలిపారు.

## రక్తి కట్టించిన రామాంజనేయ యుద్ధం :

ఎన్నికల సంబరంలో రామరావణ యుద్ధాలు, మహభారత యుద్ధాలు జరుగుతుంటే, ఈ రామాంజనేయ యుద్ధమేమిటా! అని జనం విస్తుపోవచ్చు. కాని ఇది ప్రపంచం. ఎవరి అభిరుచులు వారివి. ఒకవైపు యుద్ధం జరుగుతున్నా, ఆ యుద్ధం భయదుఃఖాలను సహించడానికి, మరువడానికి నాటకాలు, వినోదాలు జరుగుతున్నప్పుడు, ఎన్నికలలో జరుగకపోవడమేమిటి? జనవరి రెండవ వారం చివర ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో జరిగిన శ్రీరామాంజనేయ యుద్ధం బాగా రక్తి కట్టించింది. ఈ నాటకాన్ని శ్రీ మారుతి రామ నాట్యకళాసమితి, హైదరాబాద్ ప్రదర్శించింది. సమితి అధ్యక్షుడు నీలకంఠశాస్త్రి రాముడుగా, మాధవపెద్ది వెంకటరత్నం నారదుడుగా, రామమూర్తి అంగదుడుగా, కె. వి. వి. కృష్ణారావు యయాతిగా, ప్రశంసనీయంగా నటించారు. శ్యామసుందర్ హనుమంతుడుగా, విశ్వామిత్ర, జాంబవంతులుగా లక్ష్మణరావు, లక్ష్మణుడుగా హనుమంతరావు, భరత శత్రుఘ్నులుగా శర్మ, బాబూరావు తమ పాత్రలను సమర్థంగా పోషించారు. ఈ సందర్భంలో ప్రసంగించిన సాంస్కృతిక శాఖ ప్రత్యేక అధికారి డాక్టర్ అంతటి నరసింహం అప్పట్లో నాటకాన్ని రక్తి కట్టించడానికి ప్రతివారూ పరిశ్రమించారు. శాంతిమతిగా ప్రసాద్ నటించి మెప్పించడం విశేషం. ఈ అభ్యుత్సాహిక నాటకసమితి ప్రదర్శనం ద్వారా సేకరించిన నాలుగు వందలరూపాయల చెక్కును ముఖ్యమంత్రికి అందజేయవలసిందిగా, నీలకంఠశాస్త్రి డాక్టర్ అంతటి నరసింహంకు అప్పగించారు.

## ఎన్నికల పొత్తులు, ఖత్తులు:

జనవరి మూడు, నాలుగు వారాలలో జంట నగరాలలో రాజకీయ సంచలనం జోరుగానే, సాగింది. 18వ తేదీన ఇందిరాగాంధి లాల్ బహదూర్ స్టేడియం ఫుట్‌బాల్ గ్రౌండులో జరిగిన ఇందిరావర్గం రాష్ట్రశాఖ ప్రథమ సదస్సును ప్రారంభిస్తూ, తన సందేశాన్ని జనానికి వినిపిస్తే తనదే విజయమన్నారు. ఇందిర వర్గం రాష్ట్ర శాఖ అధ్యక్షులుగా డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ఎన్నికయ్యారు. పదకొండుమంది ఉపాధ్యక్షులు, 16 మంది ప్రధాన కార్యదర్శులు. ఇందిరవర్గం వెళ్ళిపోవడంతో పీడ విరుగడ అయిందని బ్రహ్మానందరెడ్డి వర్గంవారు అనడం, ఇలా పరస్పరం దూషణ తిరస్కారాలు జల్లులు పడుతూనే వున్నాయి. ఇక ఎన్నికల పొత్తులు, మిలాకత్తులు విచిత్రంగా జరిగాయి. ఇంతవరకు ఇందిరాగాంధిని పైకెత్తిన కమ్యూనిస్టులు బ్రహ్మానందరెడ్డితో కలిశారు. మార్క్సిస్టులకు జనతాతో పొత్తు పాతదే. ఇందిరావర్గంతో రిపబ్లికన్‌లు పొత్తు కలిపారు. మరొక విచిత్రం మజ్లిస్‌తోను బ్రహ్మానందరెడ్డి వర్గం మిలాఖత్తు. ఆవు—దూడ చిహ్నం తాత్కాలికంగా బ్రహ్మానందరెడ్డి వర్గం కాంగ్రెస్‌దే ఎన్నికల

కమిషన్ కేటాయించడం జరిగింది గనుక నిశ్చింతగా ఈ వర్గంవారు ప్రచారం ప్రారంభించారు. అభ్యర్థిత్వానికి దరఖాస్తుల కోసం రద్దీ కూడ ఎక్కువే. జనతా టిక్కెట్ల కోసం 1,700 దరఖాస్తులు వచ్చాయంటే, కాంగ్రెస్ [బ్రహ్మానందరెడ్డి] టిక్కెట్లకోసం 3,000 దరఖాస్తులు వచ్చాయంటున్నారు. ప్రచారం కూడ ముమ్మరంగా సాగుతున్నది. జనతా నాయకులు, చంద్రశేఖర్, మధులిమాయే మున్నగువారు ప్రచారం ప్రారంభించారు.

గవర్నరు హితవు :

రాష్ట్ర సెద్యాల కులాల సంక్షేమ సంఘం 35వ రాష్ట్రస్థాయి వార్షికోత్సవాలను గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ జనవరి 22న ప్రారంభోత్సవం జరుపుతూ, హరిజనులకు, గిరిజనులకు చెప్పిన హితవు చాల బాగుంది. ప్రతి విషయానికి ప్రభుత్వంపై ఆధారపడడం మానాలని, అలా ఆధారపడడం వల్ల చొరవ నశించిపోతుందని, హరిజన, గిరిజనులు సంఘంలో భాగంగా మెలగాలని ఆమె సూచించారు. కాని వారి సర్వతోముఖాభివృద్ధికి ప్రభుత్వం నిరంతరం కృషి చేస్తూనే వున్నది. వారికి అన్నివిధాల రక్షణ కల్పించడమే ప్రభుత్వం బలమైన కోరిక. అని ఆమె అన్నారు. స్వాతంత్ర్యం వచ్చి, తరం దాటింది. హరిజనులు, గిరిజనులు రొమ్ము విరుచుకొని సంఘంలో నిలబడాలి. సంఘం మధ్యన నిలబడాలి. జంకరాదు.

# హైదరాబాద్ నోట్ బుక్

గవర్నర్ చెప్పిన హితవును పాటిస్తారని ఆశిస్తున్నాము.

ఇండియన్ నేషనల్ థియేటర్ యువజనశాఖ:

యువకుల శక్తి యుక్తులు సంఘశ్రేయస్సుకు వినియోగపడాలి. అని ఇటీవల రవీంద్రభారతిలో ప్రారంభమయిన ఇండియన్ నేషనల్ థియేటర్ యువజన శాఖను ప్రారంభించిన యువజన సేవాశాఖ డైరెక్టర్ శ్రీ ప్రసాదరావు (ఐ. ఎ. ఎస్.) అధ్యక్షత వహించిన సాంస్కృతిక శాఖ ప్రత్యేకాధికారి శ్రీ డాక్టర్ అంతటి నరసింహం నొక్కి చెప్పారు. సంస్థ ఉపాధ్యక్షుడు శ్రీ ఎం. మదన్‌మోహన్ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. కామేశ్వరరావు, కోశాధికారి శ్రీ కె. బదరీనాద్, యువజనశాఖ సమావేశకర్త శ్రీ శేష ప్రసాద్ ఈశాఖ ప్రారంభించవలసిన అవసరం వివరించారు. తర్వాత జరిగిన వినోద ప్రదర్శనంలో నందకిశోర్ చేసిన మత్స్యాకార నృత్యం, అందరూ నటులే నాటిక— ముఝేసే దో హిందీ నాటిక, ప్రసాద్ చేసిన మిమిక్రీ జనాన్ని ఆకర్షించాయి.

అంధుల ప్రదర్శనం :

కానని వాని నూతగొని, కానని వాడు. అని అంధే నైవనీయ కననివాని మూతగొని, అందేనైవనీయమానా యథాంధా: అని సాహిత్యంలో నానుడులు జనవరి 23న జరిగిన అంధుల ప్రదర్శనం చూచిన తరాత అర్థరహిత మయ్యాయి. అంధులు కూడ నాయకత్వం వహించి, తమ కార్యం సాధించుకోగలరని నిరూపిత మయింది. దాదాపు వందమంది అంధులు ఈ ప్రదర్శనంలో పాల్గొన్నారంటె పదిమంది అంధురాండ్రూ వున్నారు. అంధుల పాఠశాలలకు సరైన భవనం సమకూర్చాలని, పట్టభద్రులయిన అంధులకు మూడువందల రూపాయల అలవెన్సు ఇవ్వాలని, అందులకు టైపింగు టెలిఫోను టిచింగ్ కోర్సులలో శిక్షణ ఇవ్వాలని, అంధబాలికలకు ప్రత్యేక పాఠశాలలు, వసతి గృహాలు వుండాలని వారు ప్రభుత్వానికి మహజరు పెట్టుకున్నారు. వూరేగింపు ఉదయం 9—00 గంటలకు చార్మినార్ నుంచి ప్రారంభమై మధ్యాహ్నం 2—00కు సెక్రటేరియట్ చేరింది

ఉపశ్రుతి :

మా సంఘం విచ్ఛిన్నమయ్యేట్టుందండీ సంఘటిత పరడచడానికి ఏమిటి ఉపాయం? అనడిగారు ఒక సంఘసమావేశకర్త. ఎందరు సభ్యులు? అనడిగాము. 30 మంది మొత్తం అయితే సమస్యేముంది? పదిమందిని పర్యాయంగా అధ్యక్షులని— పదిమంది ఉపాధక్షులని, తొమ్మిదిమంది కార్యదర్శులని— ఒక కోశాధికారి అని ప్రకటించండి అన్నారు పక్కన వున్న ఒక పెద్ద మనిషి.

## చంద్రగిరి దుర్గము

చరిత్రాత్మక రంగస్థల నాటకము. రచన: శ్రీ సోంపల్లి బాలయ్య 78 పేజీలు, రు 4.00 ప్రతులకు రచయితపేర, నూతక్కి (పోస్టు), గుంటూరుజిల్లా, అన్న చిరునామాకి వ్రాయాలి.

## కవితాలహరి

ఉపన్యాసమంజరి. యువభారతి 40వ ప్రచురణ అయిన ఈ పుస్తకంలో కవితా మూర్తులు నాపన

# అవీ...ఇవీ...అన్నీ

సోమప్ప, పిల్లలమర్రి పినవీరభద్ర కవి, శ్రీరంజాషువా, డాక్టర్ దాశరథిగార్లగూర్చి శ్రీయుతులు దివాకర్ల వెంకటావధాని, బి రామరాజు, సి నారాయణరెడ్డి, జి వి సుబ్రహ్మణ్యంగార్ల ఉపన్యాసాలని ప్రచురించారు 120 పేజీలు గల ఈ పుస్తకం వెల రు 6—00 ప్రతులకు : యువభారతి, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్—500 003

## హనుమద్వివాహము (అను గర్వభంగము)

పద్య నాటకము : రచన : కీ.శే. ఇమ్మడి బస్వప్ప, 48 పేజీలు, వెల రెండు రూపాయలు. ప్రతులకు శ్రీ ఇమ్మడి లింగయ్య, పూకొండి గ్రామం, నల్లగొండ తాలూకా, జిల్లా.

## ఏటి కోళ్ళు

రచన : డాక్టర్ నారపరాజు శ్రీధరరావు, ఎం.ఎ. బి. ఎస్. డి. టి. ఎం. మానవ సంఘములోని కొన్ని మర్యాదలను ఈ పుస్తకం ద్వారా రచయిత దేవునికి విన్నవించుకొంటూ కొన్ని అనుమానాలను కరికలను తెలియ చేశారు. 66 పేజీలు వెల రు 2—50 పై.లు ప్రతులకు రచయితపేర రామచంద్రపురం చీరాల 523 155 అన్న చిరునామాకి వ్రాయాలి.

## కిరణాలు—కెరటాలు

కవితాముక్తకాలు—యువభారతి 53వ ప్రచురణ రచన తిరుమల శ్రీనివాసాచార్య. 64 పేజీలు, వెల 2 రూపాయలు. ప్రతులకు : యువభారతి, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్—500 003.

## సాహిత్యాధ్యయనం

వివిధ సాహిత్య ప్రక్రియల సమాలోచనం. యువభారతి 55వ ప్రచురణ. రచన : శ్రీమతి వరి మళాసోమేశ్వర్ (నవల), శ్రీ తిరుమల శేషాచార్యులు(నాటకం) శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి (జర్నలిజం), డాక్టర్ జి. సి. సుబ్రహ్మణ్యం(కవిత్వం) 48 పేజీలు, వెల రెండు రూపాయలు ప్రతులకు : యువభారతి, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్ 500003

## తెనుగుభాషా ధ్యనము

రచన : శ్రీ వెల్లటూర్ల వేంకటేశ్వరరావు 156 పేజీలు వెల 9 రూపాయలు ప్రతులకు శ్రీ వి. వేంకటేశ్వరరావు ఎం. ఏ. బి. ఎస్ 3—6—537 హిమాయత్‌నగర్, హైదరాబాద్—500 029.

## మనసు గీసిన చిత్రాలు

కవితా సంపుటి రచన : శ్రీ రంగినేని సుబ్రహ్మణ్యం 40 పేజీలు వెల రు 4—00లు ప్రతులకు రచయితపేర శ్రీ వాణి నిలయం, కొల్లాపురం, మహబూబ్‌నగర్ జిల్లాకి వ్రాయాలి.

# ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

మీ పత్రికలు యీమధ్యన మరి బ్రహ్మాండంగా ఉంటుంది. కాని యీ మధ్య మరి బాగుంది. అనుకున్నాను. కాని లోపలి పేజీలు చూడగానే కళ్ళు తిరిగిపోయినాయి. వీలయినంత త్వరలోని మామూలు స్థితికి వస్తే బాగుంటుంది. తరువాత 27—1—78 తేది పత్రికలోని ఇదేమిలోకం కథ పెద్ద బాగలేదు. కారణం ఈ కాలంలో జనన్నాయకులులాంటి వాళ్ళు చాల తక్కువ బహుశ ఎవ్వరు ఉండరు కూడా కాలానికి దూరంగా పెద్ద కథ బాగానే ఉంది. తరువాత అంతరం కథ కూడ బాగనే ఉంది. రాగమాలిక సీరియల్ టాప్ సినిమా జి. ఎ. జి. పేజి హైలైట్.

కె. సాయి కుమార్—[విశాఖపట్నం.]

## సీరియల్

6—1—78 వ తేదీన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి ముఖచిత్రముతో వెలువడిన సంచిక చాలాబాగున్నది. ఆమె నిర్ణయం కథ బాగున్నది. రాగమాలిక సీరియల్ చాలా చక్కగా వస్తున్నది. వారసాల పేరంటములో పేరంటాళ్ళ ప్రవర్తనకు, మంజుల పడిన బాధ, సుశీల వాదార్పు పడిన మరదళ్ళ అనురాగము రచయిత్రి చాలా బాగా వర్ణించినారు. సీరియల్ చదువుటకు మళ్ళీ పత్రిక ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూస్తున్నాను. ఇంతమంచి సీరియల్‌ ప్రకటిస్తున్న మీకు వ్రాసిన శ్రీమతి పుణ్యశీలగార్కి మా అభినందనలు.

ఆర్. సావిత్రిదేవి— రాజమండ్రి.

* * *

27—1—78 వ తేదీన జయసుధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాగున్నది. పి. ఏ. హిమబిందు అను చిన్న సీరియల్ చాలా బాగున్నది. శ్రీమతి మాధవ పెద్ది పుణ్యశీలా ప్రసాద్ రచించిన రాగమాలిక అను సీరియల్ మా కెంతో నచ్చినది.

డి. రమణయ్య—నందూరు.

* * *

మా అభిమాన నటి జయసుధ ముఖచిత్రంతో వెలువడిన 27—1—78 పత్రిక చూడముచ్చటగా ఉంది. సీరియల్ రాగమాలిక చాలా ఇంటరెస్టింగా ఉంది. కథలు కూడా చాలా బాగున్నాయి. పాలాక్షుని డైరీ చిక్కిపోయింది.

దాడి బాలప్ప— లవనాపల్లి







**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# వసంత కాలపు మీ విశ్రాంతి
# కేవలం కొద్ది గంటల దూరంలోనే ఉంది.

భారత దేశంలోని ప్రతి ప్రాంతం కూడా వేయి వసంతాల శోభతో మీకు ఆనందం కలుగజేస్తుంది కొద్ది గంటలలోనే అక్కడకు చేరుకోవచ్చు—విమానం ద్వారా



## ఉత్తరం

**కాశ్మీర్** పూలతో కప్పబడిన భూతల స్వర్గం చేపలు పట్టడం సుదూర ప్రాంతాలకు నడక ఎడ్లబండ్లపై షికార్లు పర్వతారోహణ ఎన్నెన్నో ఆహ్లాదాలు విమానాశ్రయం— శ్రీనగర్

**మధుర** శ్రీకృష్ణ భగవానుని పుట్టిల్లు ఇక్కడ హోలి వేడుకలలో మైమరచిన ఆనందం చెందండి సమీప విమానాశ్రయం— ఢిల్లీ

**అమృత్‌సర్** పంటలు చేతికందినప్పుడు వైశాఖీ పండుగకి ఉద్రేకపూరితమైన భాంగ్రా నృత్యం ఇక్కడి విమానాశ్రయం నుంచి భారతదేశంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చు

## దక్షిణం

**కొడైకెనాల్** కొండలలో తివాచీగా పరచిన అడవి పూలతో మకరంద సువాసనలతో నిండిన విశ్రాంతి కేంద్రం సమీప విమానాశ్రయం —మధురై

**తిరుచురాపల్లి** 800 మీటర్ల ఎత్తున రాతి దేవాలయానికి సుప్రసిద్ధం కావేరీ తీరంలోని శ్రీరంగం దేవాలయం ఇక్కడనే ఉంది విమానాశ్రయం

**బృందావన్ గార్డెన్స్** ఎగజల్లే ఫౌంటెన్లు రంగు రంగుల దీపాలతో రాత్రి పగలుగా కనిపించే సుందర వనం సమీప విమానాశ్రయం— బెంగుళూరు

## తూర్పు

**డార్జిలింగ్** మంచుతో కప్పబడిన కాంచన జంగ శిఖరాన్ని చూస్తూ మైమరచిపోవచ్చు ప్రపంచంలో అత్యున్నతంలోని రేస్‌కోర్స్ ఇక్కడే ఉంది సమీప విమానాశ్రయం - బాగ్‌డోగ్రా

**పాట్నా** మగధ సామ్రాజ్యపు ప్రాచీ రాజధాని—ఈనాడు త్వరితగతిని అభివృద్ధి చెందుతున్న ఆధునిక నగరం ఇక్కడి నుంచి విమానంలో భారతదేశంలోని అన్ని ప్రాంతాలకు వెళ్ళవచ్చు

**కాజీరంగ** ఇక్కడ వన్యమృగ సంరక్షణ కేంద్రంలో ఏనుగుపై కూర్చొని ఖడ్గమృగాల ఫోటోలు తీసుకోవచ్చు

**మానస్** మానవుడు అదుపులో పెట్టని సువిశాలమైన అడవులు ఇక్కడి వన్యమృగ సంరక్షణ కేంద్రంలో అనేక అడవి జంతువులు కనబడతాయి సమీప విమానాశ్రయం — గౌహతి

## పశ్చిమం

**కాన్‌హా** పెద్దపులి లేళ్ళు సాంబార్ అడవి దున్నలకు జాతీయ పార్క్ సమీప విమానాశ్రయం—రాయ్‌పూర్

**కార్నాలా** విహంగ సంరక్షణ కేంద్రం పక్షులను చూసి ఆనందించే వారికి చక్కటి అవకాశం సమీప విమానాశ్రయం— బొంబాయి

**ద్వారక** కృష్ణభగవానుని జన్మస్థలంగా పవిత్రత చెందిన ప్రదేశం ముఖ్యమైన పుణ్యక్షేత్రం సమీప విమానాశ్రయం— జామ్‌నగర్

ఎక్కడనుంచి అయినా కొద్దిసేపు విమాన ప్రయాణమే

ఇండియన్ ఎయిర్‌లైన్స్ అతి వేగంగా వెళ్ళే అధునాతన విమానాలతో దేశమంతటా పూర్తి సర్వీసులతో మిమ్మల్ని ప్రతి చోటుకు తీసుకువెడుతుంది

మీ ట్రావెల్ ఏజెంట్ అన్ని ఏర్పాట్లతో మీకు సహాయపడతారు.

**పలు ప్రదేశాలకు**
**IA ద్వారా**
**ప్రయాణం చేయండి**

**ఇండియన్ ఎయిర్‌లైన్స్**




## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

## సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
అమోఘమగు
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL